"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ,
ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక,
సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ



## మీకు కావలసిన సామాను:

- గట్టి కార్డ్‌బోర్డు
- మెత్తని కార్డు
- వెల్వెట్ కాగితాలు (నలుపు, నీలం, పసుపుపచ్చ)
- తేగూరురంగు కాగితం
- పత్తి లేదా స్పాంజ్
- తెల్లని సిల్కు కార్డ్ (ముతకదారం)
- సన్నని శాటిన్ రిబ్బను
- పెద్ద లోహపు రింగు (4" వ్యాసం గలది)
- ఫెవికాల్ ఎమ్ ఆర్ ఎడ్హెసివ్




1. ముంజేతులూ, కాళ్ళు తయారు చేయడానికి 4 కార్డ్‌బోర్డ్ ముక్కల్ని, ఇక్కడ చూపించ-బడినట్లుగా ముఖాన్ని తయారుచేసేందుకు వలయాకారాన్ని కత్తిరించండి.




2. గట్టి కార్డ్‌బోర్డ్ నుంచి, శరీరాన్ని తయారుచేసేందుకు (ఇక్కడ చూపించిన ఆకారంలాగ) కత్తిరించండి. పత్తి ఉన్ని/స్పాంజ్, పీటని శరీరం, ముంజేతులూ కాళ్ళు, ముఖం పీటపైన అంటించి, దానిపైన నల్లని వెల్వెట్ కాగితాన్ని కప్పండి.



3. నీలి వెల్వెట్ కాగితాన్నుంచి, ముక్కును తయారు చేసేందుకు కొనలాంటి ఆకారాన్ని చెయ్యండి. దాన్ని ముఖంపైనన అంటించండి. ఆ కొన ఆకారపు చివరని కత్తిరించి, మరి ముక్కును చేసేందుకు, ఆకుపచ్చని వలయాన్ని అంటించండి. మరి అర్ధ వలయాకారంలో, నల్లని వెల్వెట్ కాగితంతో చేసినది మరిఒక్క. నోరు అవుతుంది.



4. మెత్తని కార్డ్ యొక్క పొడుగైన భాగం అంటే నీలి వెల్వెట్ కప్పబడినది ముక్కుపైకి వెళుతుంది. ఆ స్ట్రిప్ యొక్క రెండు చివరలకీ పసుపుపచ్చ కాగితాన్ని అతికించండి. అవుతాయవి చెవులు. నల్లని వెల్వెట్ కాగితంతోనూ, తెల్ల కాగితంతోనూ కళ్ళను తయారుచేసి ఆ స్ట్రిప్‌కి అతికించండి.



5. చూపించినట్లుగా, శరీరం, కాళ్ళు ముంజేతులూ ముఖమూ అతికించండి. పాదాలూ, వేళ్ళూ, చిక్కట్లూ, ఎప్రన్ పీటకోసం నల్ల ఫెల్ట్ కాగితాన్ని కత్తిరించండి. చూపించినట్లుగా అతికించండి.



6. స్కర్ట్ స్లీవ్స్. కాలర్ కోసం, పసుపుపచ్చ చివరలను కత్తిరించండి తెల్ల సిల్క్ కార్డ్ (ముతక దారు) మెడ, నడుమూ పీటకోసం దక్కన ఆ తయారు అవుతుంది. మడికట్టుకి చిలమండకి, బుగ్గలకి కూడా అంటించండి దాన్ని.



7. ఎడమ చేతి వెనకగం ఎూప్‌కి రిబ్బన్ అతి-కించండి. కుడి పాదం వెనకాం చక్రం అంటించడం కోసం రిబ్బన్ వాడండి. మరి (కోతి) వీపుకి తేగూరురంగు కాగితాన్ని అతికించండి.

ఇంక కబుర్లే కబుర్లు! మరి ఈ మంకీ (అల్లరి కోతి) ఇక మీ పేప్కిన్స్ నుంచి ఉయ్యాలలూగుతూ గెంతుతుంది!

# ఫెవికాల్® ఎమ్ ఆర్

సింథెటిక్ ఎడ్హెసివ్

**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**






We're all in it together for the fun of it, for the taste of it!

CAMPA ORANGE FLAVOUR – IT'S THE FLAVOUR OF FUN!

OBM/5361

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''కనకసుందరి కథ''] కు ఆధారం, బొమ్మిడి అచ్చారావు రచన.

ఏ విద్యనేర్వదలచినా మనిషికి కొన్ని సాధారణ అర్హతలంటూ వుండాలి. అలాంటివాటిలో, అన్నిటికన్న ముఖ్యమైనది నిజాయితీ. అది లేనివాడు విద్య కోసం ప్రయత్నించడం వృధాశ్రమ. ఈ విషయం ''అనర్హుడు'' అన్న కథలో చక్కగా వివరించబడింది.

## అమరవాణి

శిరసా తపనం ధృత్వా, ఛాయాం యచ్ఛతి పాదపః,
అనుభూయ స్వయం కష్టం, సుజనోన్య సుఖప్రదః.

[చెట్టు తలపై మండుటెండను భరిస్తూ, ఇతరులకు చల్లని నీడనిస్తుంది. అదే విధంగా, ఉత్తముడు తాను కష్టాలు అనుభవిస్తూ కూడా, పరులకు మేలు చేయచూస్తాడు.]

సంపుటి 74 జూన్ '84 సంచిక 6

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు



## నిద్రలేపే మాత్రలు

నిద్ర రావాలంటే మాత్రలు వేసుకుంటారనేది అందరికీ తెలుసు. ఇప్పుడు నిర్ణీతసమయానికి నిద్రలేవడానికి కూడా మాత్రలు రానున్నాయని—జర్మనీలోని ఒక పరిశోధన సంస్థ తెలియజేస్తున్నది.

## సింహాల కాపలా

ఇటలీలోని నేపుల్స్ సమీపంలోని చిన్న పట్టణంలో, ఒక వ్యాపారి తన దుకాణానికి అపూర్వమైనరీతిలో—సింహపు కొదమలను కావలా ఉంచాడు; అతడు సర్కస్ కంపెనీ నుంచి రెండు సింహం పిల్లలను సంపాయించి, వాటిని ఎంతో ప్రేమగా పెంచాడు. అవి కూడా, అతని మీదా, చుట్టుపక్కలవారి మీదా ప్రేమగా నడుచుకునేవి. అయినా పోలీసులు సింహాల కావలా దృశ్యం చూసి, ఆ రెండు సింహాలను జంతు ప్రదర్శనశాలకు అప్పగించవలసిందిగా వ్యాపారికి ఉత్తరువు చేశారు.






## సరికొత్త రికార్డు

పశ్చిమ జర్మనీ హెస్లింజన్ నగరానికి చెందిన ఎనిమిదిమంది వనితలు—రెండున్నర మీటర్ల ఎత్తయిన ఊచల్లాంటి స్తంభాల మీద 122 గంటలసేపు కూర్చుని—ఆ 'క్రీడ'లో సరికొత్త రికార్డు సృష్టించామంటున్నారు.

## మీకు తెలుసా?

1. 'టెలిఫోన్'ను కనుగొన్న వారెవరు?
2. 'టెలిస్కోప్'ను రూపొందించిన శాస్త్రవేత్త ఎవరు?
3. 'గ్రామఫోన్'ను రూపొందించిన శాస్త్రవేత్త పేరేమిటి?
4. 'లౌడ్‌స్పీకర్'ను కనుగొన్న వారెవరు?
5. 'స్టెతస్కోప్'ను రూపొందించిన శాస్త్రవేత్త ఎవరో మీకు తెలుసా?

(సమాధానాలు 64వ పేజీలో)



# అనర్హుడు

కోసలరాజధానీ నగరానికి సమీపంలోని ఒక అరణ్యంలో, విమలానందుడనే ముని గురుకులం నడుపుతూ, విద్యార్థులకు విద్యాదానం చేస్తూండేవాడు. ఆయన వద్ద తర్క, మీమాంస, వ్యాకరణ, ఇంద్రజాలం లాంటి శాస్త్రాల్లో ఉద్దండులైన పండితులుండేవారు.

ఆయన గురుకులంలో విద్యనభ్యసించాలని, నగరం నుంచి సుదాసు, మోహనుడు అనే కుర్రవాళ్ళిద్దరు బయలుదేరారు. వాళ్ళు గురుకులం చేరి, విమలానందుడి దర్శనం చేసుకుని, తాము వచ్చిన పని చెప్పారు.

విమలానందుడు వాళ్ళకు వసతి చూపించి, ''ముందు మీ ఇద్దరూ ఎలాంటి శాస్త్రవిద్య నేర్చుకునేందుకు అర్హులో తెలుసుకోవలసి వుంది. అందుకు కొద్ది కాలం పడుతుంది. ఈలోపల గురుకుల నియమాలను పాటిస్తూ, యిక్కడే వుండండి,'' అన్నాడు.

ఒక వారం గడిచింది. ఆ రోజు గురుకులానికి అవసరం అయిన కట్టెలు కొట్టుకురావలసిన పని సుదాసు, మోహనులపై పడింది. వాళ్ళు చెరొక గొడ్డలి తీసుకుని ఎండిన చెట్లకోసం వెతుకుతూ, అరణ్యంలో చాలా దూరం పోయారు.

ఒకచోట వాళ్ళకు ఎండిపోయిన చెట్టొకటి కనిపించింది. ఇద్దరూ కలిసి ఆ చెట్టును పడగొట్టి, దాన్ని చిన్న కట్టెలుగా నరకసాగారు. ఆ సమయంలో వాళ్ళకు చెట్టుబోదె మధ్యలో, ఒక బంగారు కాసుల మూట కనిపించింది. దాన్ని చూస్తూనే మోహనుడి కళ్ళు మిలమిలా మెరిశాయి.

వాడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, ''సుదాసూ, ఈ రోజుతో మన

గుంటక సాంబిరెడ్డి



మార్గాలున్నవి. ధనం ద్వారా విద్య సంపాయించలేం గాని; విద్య ద్వారా తర్వాత ధనం సంపాదించుకోవచ్చు. అనుకోకుండా లభిస్తున్న యీ ధనం, అనుకోకుండానే మన దగ్గిర నుంచి పోవచ్చు. కాని, మనం నేర్చిన విద్య ఎన్నటికీ మనలను వదిలి పోదు. గురుకుల నియమాల ప్రకారం, యీ బంగారాన్ని తీసుకుపోయి గురువు గారి కివ్వాలి,'' అన్నాడు.

మోహనుడికి ఆ మాటలు ఏమాత్రం రుచించలేదు. వాడు బంగారాన్ని ఎంచి రెండు భాగాలు చేసి, ఒక భాగం సుదాను కిచ్చాడు. తరవాత తనవంతు బంగారాన్ని చొక్కా లోపల బయిటికి కనబడకుండా భద్రంగా దాచుకుని సుదానుతో, ''నేను ఇంటికి వెళ్ళిపోతున్నాను. నీవు గురుకులానికి తిరిగి వెళ్ళి, నీ ఇష్టం వచ్చిన విద్య నేర్చుకో,'' అని తిన్నగా ఇంటిదారి పట్టాడు.

దారిలో వాడు ఒక చిన్న సెలయేరు దాటవలసి వచ్చింది. అందులో దిగి వాడు నాలుగడుగులు వేయగానే, కాళ్ళకేదో చుట్టుకున్నట్టనిపించి, మరుక్షణం కుడికాలి చీలమండ దగ్గిర గట్టిగా సూదులతో పొడిచినట్టయింది.

మోహనుడు భయకంపితుడైపోయి, వెనక్కు తిరిగి కాలును గట్టిగా విదిలిం

దారిద్ర్యం తీరిపోయినట్టే! ఈ బంగారాన్ని యిద్దరం పంచుకుందాం. దానితో ఇళ్ళూ, భూములూ కొనుక్కుని, జీవితాంతం వైభవంగా బతకవచ్చు. ఇక మనం కష్టపడి చదువు నేర్వవలసిన అవసరం లేదు. ఎంత చదువుకున్నా, అది డబ్బు సంపాదించి సుఖపడడానికేగదా! ఈ ధనం తీసుకుని తిన్నగా ఇంటికి పోదాం. ఇక గురుకులానికి పోవలసిన అవసరం కూడా లేదు,'' అన్నాడు.

సుదాను ఆ మాటలకు అయిష్టంగా తలాడించి, ''మనం విద్యనేర్చుకోవడానికి వచ్చాం. విద్య కేవలం ధనం సంపాయించడానికేకాదు! ధన సంపాదనకు అనేక

చాడు. దానితో పెద్ద పామొకటి ఒడ్డున పడి, దాపులనే వున్న పొదలలోకి చర్రున పరిగెత్తింది.

వాడు ఒడ్డు మీదికి వచ్చి కాలిని పరీక్షగా చూశాడు. చీలమండ దగ్గిర పాము కోరలు దిగినట్టు స్పష్టంగా కనిపించింది. దానితో వాడికి ప్రాణభయం పట్టుకున్నది. సహాయం కోసం కేకలువేస్తూ, సెలయేటి ఒడ్డునే పరిగెత్తసాగాడు.

మోహనుడు అలా కొంత దూరం పరిగెత్తేసరికి, ఎదురుగా ఒక ఆటవికుడు రావడం కంటపడింది. వాడు, ఆటవికుణ్ణి సమీపించి, ''నన్ను పాము కరిచింది. నీ దగ్గిర పాముకాటుకేమైనా మందున్నదా?" అని అడిగాడు.

''పాముకాటుకు వైద్యం చేయడం అనేది, మా ఇంట తరతరాలుగా వస్తున్న విద్య. నేను మందువేసి, నీ ప్రాణాలు పోకుండా కాపాడతాను. అందుకు ప్రతిఫలంగా నువ్వు చొక్కా లోపల దాచుకున్న బంగారమంతా యివ్వాలి. ఇష్టమేనా?'' అని అడిగాడు ఆటవికుడు.

తన చొక్కా లోపల దాచిన బంగారం సంగతి, యీ ఆటవికుడికి ఎలా తెలిసిందని, మోహనుడు అచ్చెరువు చెందాడు. అప్పటికే వాడి నోటి నుంచి నురుగు వస్తున్నది. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. ముందు తన ప్రాణం కాపాడుకోవడం ముఖ్యం. వాడు మారు పలకకుండా బంగారాన్ని ఆటవికుడికి యిచ్చాడు.



ఆటవికుడు అక్కడ వున్న పొదలలోకి పోయి, ఏవో ఆకులు తెచ్చి, వాటి రసం మోహనుడి నోట్లోనూ, ముక్కులోనూ పిండాడు. ఆ మరుక్షణం మోహనుడికి పాము కరిచిన లక్షణాలన్నీ మటుమాయ మయినై. ఆటవికుడు చిన్నగా నవ్వు కుంటూ అరణ్యంలో ఎటో వెళ్ళి పోయాడు.

దొరికిన అంత బంగారం పోయినం దుకు మోహనుడికి ఎక్కడలేని దిగులు కలిగింది. వాడు కొంచెంసేపు ఆలోచించి, ఎటూ బంగారం పోయింది కనక, గురు కులంలో విద్య అయినా నేర్వవచ్చును కుంటూ, విచారంగా గురుకులానికి తిరిగి వెళ్ళాడు.

మోహనుణ్ణి చూస్తూనే, విమలానంద ముని, ''నీకూ, సుదాసుకూ తెలియ కుండా, మీ ఇద్దరికీ ఒక చిన్న పరీక్ష పెట్టాను. అందులో సుదాసు నెగ్గాడు. అతణ్ణి గురుకులంలో చేర్చుకున్నాను. నువ్వెలాంటి శాస్త్రవిద్యలు నేర్చేందుకూ అర్హుడివి కావు. ఇంటికి తిరిగిపో!'' అన్నాడు.

వాడు నిరాశతో తల వంచుకుని అక్కడి నుంచి బయలుదేరాడు. గురు కులం బయట చెట్లకింద వాడికి, తనకు పాముకాటుకు వైద్యం చేసిన ఆటవికుడు కనిపించాడు.

ఆటవికుణ్ణి చూస్తూనే మోహనుడికి ఒక సందేహం కలిగింది. వాడు అక్కడ వున్న విద్యార్థినొకణ్ణి, ఆ ఆటవికుడు ఎవరని అడిగాడు.

ఆ విద్యార్థి, ''ఆయన ఆటవికుడు కాదు. కోరిన విద్యార్థులకు ఇంద్రజాలిక విద్య నేర్పే ఆచార్యుడు. ఈ రోజు ఆటవి కుడి వేషం ధరించాడు,'' అని చెప్పాడు.

ఆ జవాబు వింటూనే మోహనుడు వంగి, తన కుడికాలి చీలమండ మీద పాము కరిచిన గుర్తులకోసం చూసుకు న్నాడు. అక్కడ అలాంటివేం కనిపించ లేదు. దానితో వాడికి విమలానందుడి పరీక్ష ఏమిటో అర్థమైంది.






## 14

[క్రూరుడైన ఓడనరంగు వల్ల అనేక యిక్కట్లు పొందిన బానిసలు, పింగళుడి నాయకత్వం కింద తిరుగుబాటు చేసి, అతణ్ణి హతమార్చారు. అదే సమయంలో శత్రుఓడ, వారున్న ఓడను సమీపించింది. పింగళుడు తన ఓడతో, శత్రు ఓడను ఢీకొట్టాడు. ఆ తాకిడికి పింగళుడు ఓడ మీది నుంచి ఎగిరి దూరంగా సముద్రంలో పడిపోయాడు. తరవాత—]

పింగళుడు ఒకసారి మునిగి నీటి మీదికి తేలి చుట్టూ కలయచూశాడు. రెండు ఓడలూ ఒకదానికొకటి ఢీకొనడంతో, ఆ తాకిడికి బదాబదలై, కొయ్యముక్కలూ, చెక్కలూ, తెరచాపలూ చెల్లాచెదురుగా— నలుమూలలకూ ఎండుటాకుల్లా ఎగిరి పోతున్నవి. మునిగిపోతున్న నావికులు చేసే హాహాకారాలు, తుఫాను ఘోషలో అణగారిపోయినై.

ఉవ్వెత్తున లేచిపడుతున్న సముద్రపు టలలలో చిక్కి పింగళుడు వుక్కిరి బిక్కిరైపోయాడు. తను సురక్షితంగా భూప్రదేశం చేరేందుకు యిప్పుడు ఓడ అంటూ ఏమీ లేదు. రెక్కల బలాన్ని నమ్ముకుని యీదేందుకు, తీరం ఎటు వైపున వున్నదో తెలియదు. యీ దుర్దశ తన ఒక్కడికే కాక, తన శత్రువులకూ, మిత్రులకు కూడా కలిగిందని గ్రహించి



పడ్డాడు. ఇక తన చావు ఎంతో దూరంలో లేదని అతడు నిశ్చయించుకున్న మరు క్షణం అతడి చేతికి ఏదో వస్తువు తగిలింది. పింగళుడు చటుక్కున దాన్ని పట్టు కున్నాడు.

ఇంతకూ పింగళుడి తల్లి అన్నట్టు, అతణ్ణి ఎప్పుడూ అదృష్టదేవత వెన్నంటే వుంటున్నది. పింగళుడి చేతులకు దొరికిన వస్తువు, ఓడ పగలగా విడిపోయిన ఒకా నొక కొయ్యపలక. పింగళుడు మనసు లోనే దేవుడికి వెయ్యి నమస్కారాలు పెట్టుకుని, ఆ కొయ్యపలకను బలంగా రెండు చేతుల మధ్యకూ తీసుకుని, దాని మీద బోర్లా పడుకున్నాడు. తుఫానూ, సముద్రపుటలలూ కలిసి, తనను ఏదో ఒకనాడు, ఏదో ఒక తీరానికి తప్పక చేర్చగలవని అతడికి ఆశకలిగింది. ఆ సమయంలో ఆకలీ, చలీ—వాటిని గురించి అతడు ఏమాత్రం ఆలోచించ దలచ లేదు.

కొయ్యపలక నీటి అలల వెంట తేలుతూ, మునుగుతూ కొట్టుకుపోతున్నది. పింగళుడు రెండు కళ్ళూ గట్టిగా మూసు కుని, కొయ్యపలక తన పట్టు నుంచి జారి పోకుండా చూసుకుంటూ తన చుట్టూ ఏమి జరుగుతున్నదీ గమనించేందుకైనా ప్రయత్నించలేదు. కారణం, అందువల్ల నప్పుడు పింగళుడికి ఆనందంతోపాటు బాధ కూడా కలిగింది.

తన ప్రాణాన్ని కాపాడుకునేందుకు, తను ఎటు యీదుకుపోవాలో పింగళుడికి అర్థం కాలేదు. కనుచూపు మేరలో ఎక్కడా భూమి అంటూ కనిపించనప్పుడు, తను వున్న చోటు నుంచి కదిలేందుకు ప్రయాసపడటం వృథా అని అతడు నిశ్చయించుకున్నాడు. కాని, అల్లకల్లో లంగా వున్న సముద్రం అతణ్ణి ప్రతిక్షణం అటూ యిటూ విసిరివేస్తున్నది.

దాదాపు ఓ పావుగంట కాలం పింగళుడు అలల వెంట, అవి విసిరినవైపుకు పోతూ మునుగుతూ తేలుతూ నానా యాతనా

తనకు మేలు లేకపోగా, పైపెచ్చు తనలో వున్న ధైర్యం కాస్తా నీళ్ళు కారిపోయేందుకు అవకాశం యిస్తుందని అతడు భయపడ్డాడు.

కొన్ని గంటలకాలం గడిచిపోయింది. సూర్యుడు ఎక్కడో సముద్రాల అవతల అస్తమించాడు. చీకటి పడింది. కాని, పింగళుడికి యివేమీ తెలియవు. అతడి కళ్ళు గట్టిగా మూతలు పడే వున్నవి. సముద్రపు హెూరూ, తన శరీరం చలికి కొయ్యబారుతూ వుండటం తప్ప, అతడికి మరేమీ గుర్తులేదు. మరి కొంతసేపటికి దప్పికతో నాలుక పిడచకట్టుకు పోతు



న్నట్టు అతడు గ్రహించాడు. అప్రయత్నంగా పింగళుడు యింత సముద్రపు నీటిని గుటకవేసి, వికారంతో కొయ్య పలక మీద మెలికలు తిరిగాడు. ఆ తరవాత భగ్గుమనే ఆకలి, నిద్ర మత్తు. క్రమంగా పింగళుడు తను పట్టుకున్న కొయ్యపలకా, హెూరు పెడుతున్న సముద్రం, తను ప్రాణాపాయ స్థితిలో వున్న సంగతీ—అన్నీ మరిచిపోయి గాఢ నిద్రలోకి జారుకున్నాడు.

*పింగళుడు తిరిగి కళ్ళు తెరిచేసరికి,* మబ్బులు లేని ప్రశాంతమైన నీలాకాశం అతడి కళ్ళబడింది. శరీరం నడుము నుంచి పైభాగం పొయ్యిలోపెట్టి కాల్చుతున్నట్టు చిటపటమంటున్నది. కాళ్ళు చలితో కొయ్యబారిపోతున్నవి.

ఈ పరిస్థితి పింగళుడికి చాలా వింతగా తోచింది. తను ఎక్కడ వున్నట్టు? అతడు నీరసంగా తల పక్కకు తిప్పి చూశాడు. కనుచూపు మేర అంతా ఇసుక ఎడారి. పింగళుడు గతుక్కుమన్నాడు. ఆ నిమిషంలో అతడికి ప్రాణభయంతోపాటు, ఎక్కడలేని సత్తువా వచ్చినట్టయింది. మోచేతులు భూమికి ఆనించి లేచేందుకు ప్రయత్నించాడు. కాళ్ళు రెండూ నీళ్ళలో నానుతున్నవి. ఎదురుగా మహా సముద్రం ఏ అలలూ లేకుండా ప్రశాంతమైన సరస్సులా నిర్మలంగా కనిపించింది.




తన పరిసరాలు ఎటువంటివో, తను ఎలాంటి భూప్రదేశాన్ని చేరాడో పింగళుడు వెంటనే గ్రహించాడు. ఒకవైపున మహా సముద్రం, రెండవ వైపున మచ్చుకైనా చెట్టూ చేమా లేని పెద్ద ఇసుక ఎడారి!

పింగళుడు తూలుతూ రెండడుగులు ముందుకువేసి, సూర్యకాంతి కళ్ళ మీద పడకుండా చేతిని అడ్డంగా పెట్టుకుని, దూరంగా గమనించి చూశాడు. అల్లంత దూరాన ఆకాశంలో ఎగురుతున్న కొన్ని రాబందులు అతడి కంటబడినై. అవి ఎక్కడికో ఎగిరిపోవటం కాక, ఒకే ప్రదేశాన చుట్టూ వలయాకారంగా ఎగురుతూ, కిందికి దిగి వస్తున్నవి.

పింగళుడిలో ఆశ్చర్యంతోపాటు, ఆశ కూడా మొలకలెత్తింది. రాబందులు ఎగురుతున్న ప్రదేశంలో ఏదో జలాశయం గాని, పల్లెపట్టుగాని తప్పక వుండివుంటుందని అతడు భావించాడు. ఈ తలపు కలగగానే, అతడిలో ఎక్కడలేని శక్తీ పెల్లుబికింది. దృష్టిని ఆ రాబందులు ఎగురుతున్న ప్రదేశం మీదే లగ్నంచేసి, అతడు భగ్గుమని కాలుతున్న ఇసుకలో ఓపికకొందికీ నడవసాగాడు.

కొద్ది సేపటికల్లా పింగళుడు ఆ ప్రదేశాన్ని సమీపించాడు. ఆసరికి కొన్ని రాబందులు కిందికి దిగి, అక్కడ పడి వున్న ఏదో వస్తువును చుట్టుముట్టుతున్నవి. ఆ దృశ్యం చూస్తూనే పింగళుడు నివ్వెరపోయాడు.

ఒక వ్యక్తి కాళ్ళూ చేతులూ, తాడుతో వెనక్కు విరిచికట్టబడి, ఒక రాతికి ఆనించబడి వున్నాడు. అతడిలో ఏమాత్రం చలనం వున్నట్టులేదు. రాబందులు అతణ్ణి పీక్కుతినేందుకు చుట్టూ మూగుతున్నవి. పింగళుడు, ఓ తృటికాలం ఆ నిర్భాగ్యుడికేసి చూసి, చప్పున వంగి అక్కడ దొరికిన చిన్న రాతిముక్కను తీసుకుని, రాబందులకేసి విసిరాడు. వెంటనే కొన్ని రాబందులు రెక్కలు టపటప లాడించి ఆకాశంలోకి లేచినై.



మరికొన్ని అంతదూరం పరిగెత్తి, తమకు కానున్న ఆహారం కేసి చూస్తున్నవి.

పింగళుడు ఆ వ్యక్తిని సమీపించాడు. అతడి కళ్ళు మూతలుపడి వున్నవి. ఏమాత్రమైనా ప్రాణం వున్న సూచన కనబడుతుందేమో అని, పింగళుడు అతడి గుండెల మీద చేయివేసి పరీక్షించాడు. చలనం లేదు.

ఈ ఇసుక ఎడారిలో ఎవరు, ఏ కారణం వల్ల ఈ మనిషిని ఇటువంటి ఘోర మరణం పాలు చేశారో పింగళుడి ఊహకు అందలేదు. కాని, అతడికి ఆ నిమిషంలో ఒక కొత్త విషయం అర్థమైంది. నిర్జనంగా కనిపించే, యీ ఎడారిలో ఎక్కడో ఒకచోట జననివాసాలు వున్నవి.

ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి? ముందు దాహం తీర్చుకునేందుకు తనకు యింత మంచినీరు కావాలి. తరవాత ఆహారం, ఇవి తనకు ఎక్కడ లభిస్తవి?

పింగళుడు యిలాంటి సమస్యలతో సతమతమవుతూండగా, దూరంగా, ఎడారిలో తిరుగుతున్న ఒకానొక ఒంటెల పటాలం నాయకుడు, తన దుర్భిణీలోంచి అతణ్ణీ, పక్కన వున్న చనిపోయిన వ్యక్తినీ, చుట్టూ ఎగురుతున్న రాబందుల సమూహాన్నీ చూశాడు. మరుక్షణం అతడి ఆజ్ఞకాగానే ఒంటెల పటాలం అమిత వేగంగా, ఆ ప్రదేశం వైపుకు పరిగెత్తరాసాగింది.

దూరంగా ఎడారిలో దుమ్ము లేస్తూండటాన్ని గమనించి మొదట ఆశ్చర్యపడిన పింగళుడికి, అంతలోనే దానికి కారణం అయిన ఒంటెల పటాలం స్పష్టంగా కనబడగానే ఉత్సాహంతోపాటు భయం కూడా కలిగింది. ఒకవేళ ఆ వచ్చేవాళ్ళు ఎడారి దొంగలైతే, ఆ నిమిషంతో తన బ్రతుకు అవసాన దశకు వచ్చినట్టే అని అతడు భయపడ్డాడు. కాని, పారిపోయి ఎక్కడైనా దాక్కునేందుకు స్థలంగాని, అందుకు అవసరమైన దేహబలం గాని తన దగ్గిర లేదు. అసలు తను యిప్పు




డున్న దీనస్థితిలో కాలుతీసి కాలు పెట్టటమే అంతంతమాత్రంగా వుంది.

పింగళుడు యిలాంటి ఊహలతో, అనుమానాలతో వుక్కిరిబిక్కిరవుతూండగా ఒంటెల పటాలం అక్కడికి రానే వచ్చింది. గంభీరమైన పెద్ద గొంతుతో నాయకుడు ఆజ్ఞాపించగానే, పటాలంలోని ప్రతి ఒక్కరూ తమ తమ వాహనాలను దిగి, పింగళుణ్ణి చుట్టుముట్టారు. నివ్వెరపోయి, నోటమాట రాక తడబడుతున్న పింగళుణ్ణి, వాళ్ళ నాయకుడు కొంచెంసేపు నిలువెల్లా పరీక్షగా చూసి, "నువ్వు రాబందు అనుచరవర్గంలోనివాడివా?" అని ప్రశ్నిస్తూ, చనిపోయిన వ్యక్తి దగ్గిర వంగి, పరీక్షగా చూసి, చప్పున తన అనుచరులకేసి తిరిగి, "ఈ చనిపోయినవాడు మనవాడే! మిగతా కోట కాపలాదళం ఏమయినట్టు? బహుశా, కోట రాబందు వశం కాలేదుగదా?" అంటూ విస్తుపోయాడు.

ఈ లోపల పటాలంలోని ఒకడు పింగళుడి వీపు మీద తన యీటెను ఆనించి, "నిజం చెప్పు, మీ నాయకుడు రాబందు ఎక్కడ?" అంటూ గద్దించి అడిగాడు.

పింగళుడికి ఆ ప్రశ్న ఏమీ అర్థం కాలేదు. బహుశా ఆ రాబందు అనబడేవాడు ఏదో దొంగల ముఠాకు నాయకుడై వుంటాడు. అలా అయితే, వీళ్ళు ఎవరు?

"నేను ఎవరి అనుచరుణ్ణీ కాదు. మహాసముద్రం మీద తుఫానులో చిక్కి నేనున్న ఓడ భగ్నం కాగా, దేవుడి కృప వలన ప్రాణాలతో యీ తీరం చేరాను. ఇక్కడ, ఈ మృతుణ్ణి రాబందులు పీక్కుతినబోవటం చూసి యిక్కడికి వచ్చాను. ఇది ఏ దేశమో, యీ ఎడారి పేరేమిటో కూడా నాకు తెలియదు," అన్నాడు పింగళుడు. ఒంటెల పటాలం నాయకుడు, పింగళుడికేసి మరోసారి పరిశీలనగా చూసి, "నువ్వు చెప్పేది నిజమయితే, నీకు వచ్చిన భయమేమీలేదు. కాని, ఒకవేళ అబద్ధం అయితే మాత్రం నిన్ను

ముక్కలుగా నరికించి, ఆ ఎగురుతున్న రాబందులకు ఆహారంగా వేయిస్తాను. నువు యిప్పుడున్నది ఆఫ్రికా సముద్ర తీరాన గల అరేబియా దేశ ప్రాంతం. నేను నవాబుగారి ఒంటెల పటాలం నాయకుణ్ణి. ఇక, నీ ఓడ సముద్రం మీద భగ్నం అవడం అదీ....అంతా నిజం చెప్పాలి, తెలిసిందా ?'' అన్నాడు.



ఆ వచ్చినవాళ్ళు దొంగలు కాదనీ, నవాబు సైనికులనీ తెలియగానే పింగళు డికి ఎక్కడలేని ఆనందమూ కలిగింది. ఆ ఎడారి ప్రాంతాన్ని పాలించే నవాబూ, అతడి ఒంటెల పటాలం నాయకుణ్ణని చెప్పే యితడూ, ఎలాంటి వారైనా ప్రస్తుతానికి మాత్రం తనకు ప్రాణభయం లేదు. తరవాత పరిస్థితులను బట్టి, అందుకు అనుగుణంగా ప్రవర్తించవచ్చు. కనక, పూర్వ గాథ అంతా వదిలి, తను బానిసగా ఓడలో చేరినప్పటి నుంచీ, జరిగిన వృత్తాంతం, అతడికిచెప్పవచ్చనుకున్నాడు పింగళుడు.

ఆ ప్రకారమే, పింగళుడు పటాలం నాయకుడికి తను చేరిన ఓడసరంగును గురించీ, మహాసముద్రం మీద తారసపడిన మరొక ఓడకూ దానికీ జరిగిన యుద్ధం గురించీ సవిస్తరంగా చెప్పాడు. అంతా విన్న పటాలం నాయకుడు తృప్తిగా ఓమారు నవ్వి, ''అయితే, మీ ఓడను ఎదిరించిన ఓడలో కూడా బానిసలున్నారనేదాంట్లో అనుమానం ఏమీ లేదు కదా?" అని అడిగాడు.

''అవును, అందులో సందేహం లేదు. ఆ ఓడసరంగుతో నేను రాజీరాయబారం నడపాలని ప్రయత్నించినప్పుడు అతడిచ్చిన జవాబునుబట్టి, అతడూ బానిసలను కొని అమ్మే వ్యాపారేనని తెలుస్తున్నది గదా ?'' అన్నాడు పింగళుడు.

పటాలం నాయకుడు అవునన్నట్టు తల పూపి, ''నా పేరు హసన్ గోరీ. నా లాగే నువ్వూ, యుద్ధంలో చాలామందికి నాయకత్వం వహించావు గనక, నువ్వు నాతో

సమానుడివే. కనక, నన్ను ఆ పేరుతో నువ్వు పిలవవచ్చు. మేము 'రాబందు' అని పిలవబడే ఒకనొక ఎడారి దొంగను హతమార్చేందుకు, యీ ఎడారిలో గస్తీ తిరుగుతున్నాం. యీ కాళ్ళూ చేతులూ బంధింపబడి, మరణించిన వ్యక్తి నవాబు సైన్యంలోనివాడే! ఇతడు ఎడారిలో వున్న ఇఫీఖిల్లాను రక్షిస్తున్నవాళ్ళల్లో ఒకడు. ఇతణ్ణి ఏవిధంగా ఆ రాబందు పట్టుకోగలిగాడో నాకు అర్థం కావటం లేదు. నా భయం ఏమిటంటే, దురదృష్టవశాత్తూ ఆ ఖిల్లా రాబందువశం అయిపోయిందేమోనని," అంటూ అతడు సైనికులకేసి తిరిగి, "ఈ క్షణం నుంచీ యితణ్ణి కూడా పటాలంలో ఒకడుగా భావించండి! పాపం, ఆకలిక అలమటిస్తున్నాడు, ఆహారం, నీరూ యివ్వండి," అన్నాడు.

హసన్ గోరీ అలా అనేసరికి, పింగళుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. సైనికులిచ్చిన రొట్టెలు తిని, చల్లని నీరు యింత తాగి, అతడు తృప్తిగా లేచి నిలుచున్నాడు. వెంటనే హసన్ గోరీ పింగళుడికి ఒక ఒంటెను చూపిస్తూ, "ఈ ఒంటె యికనుంచీ నీ వాహనం. మనం యిప్పుడే బయలుదేరుతున్నాం. ఇఫీఖిల్లాను రాబందు ఆక్రమించుకున్నాడేమో అని నాకు అనుమానంగా వుంది," అంటూ ఒక సైనికుడికేసి తిరిగి, "ఆ శవాన్ని ఒక ఒంటె మీద వేయండి. ఖిల్లా దగ్గిర సమాధిచేద్దాం. ఈ రాబందులకు ఆహారంగా అతణ్ణి వదలటం మహా పాపం," అన్నాడు.

కొద్దిసేపట్లోనే పటాలం బయలుదేరింది. ఎడారిలో రేగుతున్న ఎడతెగని యిసుక తుఫానుల్లో ప్రయాణిస్తూ, సూర్యుడు పశ్చిమానికి దిగుతూండగా, పటాలం ఇఫీఖిల్లాకు కనుచూపు మేరలో చేరింది. ఖిల్లా పరిసరాలు నిర్మానుష్యంగా వున్నవి.

హసన్‌గోరీ, పింగళుడికేసి తిరిగి ఆశ్చర్యంగా కనుబొమలు ముడివేసి, ఖిల్లా వైపుకు చేయిచూపాడు. —(ఇంకావుంది)






# కనకసుందరి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ ఎంతో పట్టుదలతో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, ఇదంతా ధర్మబుద్ధితో మరెవరికో సహాయపడేందుకు కాక, నీ సొంత మేలుకోసమే అయి వుంటుందన్న అనుమానం కలుగుతున్నది. కాని ఒక్కొక్క సమయంలో పరిస్థితులు అనుకూలించనప్పుడు, మనుషులు తమ పట్టుదల విడిచి, ప్రాణభయం కొద్దీ తాము ద్వేషించేవారికి లొంగిపోతారు. ఇందుకు ఉదాహరణగా నీకు, కనకసుందరి అనే రాజకుమార్తె కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



జస్వంతరాజ్యాన్ని రాజు కులదీపుడు చాలా ఏళ్ళు ప్రజానురంజకంగా పాలించాడు. ఆయన వద్ద సుకీర్తి అనే మంత్రి వుండేవాడు. కులదీపుడికి రాచకార్యాల్లో అవసరమైన సలహాలన్నీ సుకీర్తి యిస్తూండేవాడు. తన మంత్రి సలహాల పట్ల కులదీపుడికి చాలా నమ్మకం.

కులదీపుడు బాగా వృద్ధుడైపోయాడు. ఆ దశలో ఆయన కొకసారి తీవ్రమైన వ్యాధి కలిగింది. దానితో ఆయన తాను మరెంతోకాలం బతకనని గ్రహించి, తన కొడుకు మణిదీపుడికి రాజ్యాభిషేకం చేశాడు. తరవాత మరణించేముందు ఆయన కొడుకుతో, "నాయనా, మన మంత్రి సలహాలేకుండా, నువ్వు ఎలాంటి నిర్ణయమూ తీసుకోవద్దు. రాజ్యనిర్వహణలో నా కన్నా కూడా ఆయన అనుభవజ్ఞుడు. ఆయన కాదన్న పని ఎన్నడూ చేయకు!" అని చెప్పి కన్నుమూశాడు.

మణిదీపుడు తండ్రికిచ్చిన మాట ప్రకారం, వృద్ధుడైన సుకీర్తినే తనకూ మంత్రిగా నియమించుకున్నాడు.

ఒకసారి మణిదీపుడు తన పొరుగు రాజైన జయపాలుణ్ణి గురించి సుకీర్తికి చెప్పి, "జయపాలుడు క్రమక్రమంగా బలవంతుడవుతున్నాడని, నా నమ్మకం. నేనతడి మీద యుద్ధం ప్రకటించదలిచాను. మీ సలహా ఏమిటి?" అన్నాడు.

సుకీర్తి కొంతతడవాలోచించి, "మహారాజా, దయచేసి, యీ ప్రయత్నం విరమించుకోండి!" అన్నాడు.

ఈ జవాబుకు మణిదీపుడు రవంత ఆశ్చర్యపడి, "ఏం, అలా అన్నారు?" అని అడిగాడు.

"మీరీ యుద్ధం చేయబోవడం రాజ్యకాంక్షవల్లనే కదా? మీ ప్రయత్నం సఫలం కానిపక్షంలో, మన సేనలు విపరీతంగా నష్టపోతాయి. అప్పుడు మరొక బలవంతుడైన రాజు, మన మీదకు దండెత్తివస్తే, మన రాజ్యానికే ప్రమాదం," అన్నాడు సుకీర్తి.



మణిదీపుడికి, సుకీర్తి సలహా అంతగా రుచించలేదు. అయినా, అనుభవజ్ఞుడు అన్న ఉద్దేశంతోనూ, తండ్రి ఆయన సలహా పాటించమని ఆదేశించి వుండడం వల్లా, అయిష్టంగానే తన యుద్ధ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

ఆ తర్వాత వారం రోజులకు మణిదీపుడు అరణ్యానికి వేటకు బయలు దేరాడు. సుకీర్తి అతణ్ణి వారించి, "మహారాజా, ఈ రోజు వేటకు అనుకూలంగా లేదు. రెండు రోజులు ఆగివెళ్ళండి," అన్నాడు.

మణిదీపుడి ఉత్సాహమంతా నీరుకారి పోయింది. "ఎందుకు వెళ్ళరాదో చెప్పారు కాదు!" అన్నాడతను.

"రానున్న నాలుగైదు గంటల కాలంలో, వర్షం వచ్చే సూచనలు కనబడుతున్నవి. వర్షంలో తడవకుండా, అరణ్యంలో తలదాచుకునే అవకాశం వుండదు గదా. అయినా, వర్షాకాలం వేటకు అనుకూలమైనది కాదు," అన్నాడు సుకీర్తి నెమ్మదిగా.

మణిదీపుడు అయిష్టంగానే మంత్రి సలహాను పాటించి, వేటకు వెళ్ళడం మానుకున్నాడు. అయితే, నాలుగైదు గంటల తర్వాత వర్షం రానేలేదు. ఆకాశంలో మాత్రం అక్కడక్కడా మబ్బు తునకలు కనిపించాయి.

మణిదీపుడు, సుకీర్తికి కబురుచేసి, "చూశారా, నన్ను వేటకు పోవద్దన్నారు. వర్షం మాత్రం రానేలేదు," అన్నాడు.

సుకీర్తి చిన్నగా నవ్వి, "మహారాజా, మన రాజధానీ నగరంలో వర్షం కురవక పోవచ్చు. కాని, నా అంచనా ప్రకారం అరణ్యంలో పెద్ద వర్షమే కురిసివుండాలి. మబ్బులజాడ నాకు బాగా తెలును!" అన్నాడు.

మణిదీపుడు సంశయ నివారణకోసం భటులను అరణ్యానికి పంపించాడు. వాళ్ళు తిరిగివచ్చి, వర్షం అరణ్యాన్నంతా ముంచెత్తిందనీ, అక్కడ పెద్ద, పెద్ద వాగులు ప్రవహిస్తున్నవనీ చెప్పారు.



రెండు నెలలు గడిచినై. ఒకనాడు సుకీర్తి, మణిదీపుణ్ణి చూడబోయి, "మహారాజా, మన పొరుగురాజు జయపాలుడు, మన మీదికి దండెత్తి వచ్చేందుకు ప్రయత్నాలు చేస్తున్నట్టు వేగులద్వారా తెలిసింది," అన్నాడు.

ఆ మాట వింటూనే మణిదీపుడు "అలాగా! గతంలో నేను జయపాలుడిపై దండెత్తబోతుంటే, వద్దని సలహా యిచ్చారు. ఇప్పుడు అతనే మన మీదికి వస్తున్నాడు. అతన్ని ఎదుర్కోవడం వల్ల కూడా సైనికనష్టంతప్పదుగదా!" అన్నాడు.

సుకీర్తి శాంతంగా, "మీరన్న మాట నిజం! దాడ చేసినా లేక దాడిని ఎదుర్కున్నా కొంత సైనిక నష్టం, జననష్టం తప్పదు," అన్నాడు.

మణిదీపుడు ఆశ్చర్యపోతూ మంత్రి కేసి చూసి, "యుద్ధం చేయకుండా లొంగిపోయి, జయపాలుడికి నన్ను సామంతుకమ్మనా, మీ సలహా?" అని అడిగాడు.

"అలాంటి అవసరం ఏమీ లేదు. జయపాలుడు సైనికబలంలో మనకేమాత్రం తీసిపోడు. అలాంటివాడితో కయ్యంకన్న వియ్యం మంచిది. ఆయనకు పెళ్ళి కెదిగిన కుమార్తె వున్నది. ఆమెను తమరు వివాహం చేసుకుంటే, మనదే పైచేయి అవుతుంది." అన్నాడు సుకీర్తి.

మణిదీపుడు, జయపాలుడి కుమార్తె కనకసుందరి అద్భుత సౌందర్యవతి అని విని వున్నాడు. వీలైతే ఆమెను పెళ్ళాడాలన్న కోర్కె అతడికి లేకపోలేదు. ఈ కారణం వల్ల మంత్రి సుకీర్తి సూచనకు అతడు అంగీకారం తెలిపాడు.

సుకీర్తి నుంచి వార్త అందగానే జయపాలుడు చాలా సంతోషించి, కుమార్తెను పిలిచి సంగతి చెప్పి, యీ వివాహం నీ కిష్టమేనా అని అడిగాడు.

కనకసుందరి ఒక క్షణం ఆలోచించి, "నాన్నా, మీరు జస్వంతరాజ్యం మీద దండయాత్ర చేయాలనుకున్నారు గదా. ఇప్పుడీ పెళ్ళిప్రస్తావన ఏమిటి?" అన్నది.

"యువకుడైన మణిదీపుడు, రాజ్య కాంక్ష కొద్దీ, ఏదో ఒకనాడు మన రాజ్యం మీద దాడి చేస్తాడన్న అనుమానం నా కున్నది. అందుకే, ముందుగా అతడి రాజ్యం మీద దాడి చేయదలిచాను. కాని, అతడు అల్లుడవుతాడంటే, నాకు సంతోషంగా వున్నది," అన్నాడు జయపాలుడు.

"మీరు దాడి చేయనున్నారని తెలిసిన తరవాతే, అక్కడినుంచి, యీ వియ్యమందాలనే కబురు వచ్చింది. దీనివెనక ఏదైనా కుట్రవున్నదేమో!" అన్నది కనకసుందరి.



జయపాలుడు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, "ఆ రాజ్య మంత్రి సుకీర్తి చాలా అనుభవజ్ఞుడు, రాజ్యతంత్రంలో మంచి దిట్ట. ఇందులో అతడి సలహా వుండవచ్చు," అన్నాడు.

కనకసుందరి అవునన్నట్టు తలవూపి, "సుకీర్తి అనుమతీ, సలహాల్లాంటివి లేనిదే, ఆ రాజు వేటకు కూడా వెళ్ళడని విన్నాను. అన్నీ మంత్రి సలహా మీద చేసేవాడు, రేపు అతడి సలహా పాటించి, నన్ను విడిచిపుచ్చడన్న నమ్మకం ఏమిటి? ఆ మంత్రికి దేశబహిష్కరణ శిక్ష విధిస్తేనే, నేను జస్వంతరాజును వివాహమాడగలనని కబురు పంపండి," అన్నది.

జయపాలుడు అలాగే కబురు పంపాడు. ఆ కబురు వింటూనే మణిదీపుడు పట్టరాని ఆగ్రహంతో, "ఆ జయపాలుడికి యింత పొగరా!" అన్నాడు.

సుకీర్తి శాంతంగా, "మహారాజా, నేను తమ పూర్వీకులుంటున్న ప్రసేనరాజ్యానికి వెళ్ళి, నా శేషజీవితాన్ని గడుపుతాను. అనుజ్ఞ యివ్వండి!" అన్నాడు.

వెంటనే మణిదీపుడు, "మీరు మంత్రిగా, మాతోనే వుండాలి. ఈ విషయంలో, మీ సలహా పాటించదలచలేదు!" అన్నాడు.

తరవాత వారం తిరక్కుండానే మణిదీపుడు, జయపాలుడి రాజ్యం మీద దాడి చేశాడు. జయపాలుడు పెద్దగా ప్రతిఘటించకుండానే, అతడితో రాజీపడ్డాడు.

కనకసుందరి మణిదీపుణ్ణి వివాహ మాడింది.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, కనకసుందరి ప్రవర్తన అనుచితంగా లేదా? ఆమె పట్టుదల అంతా ఏమైంది? మంత్రికి దేశబహిష్కరణ విధించితే తప్ప, మణిదీపుణ్ణి వివాహం ఆడనన్నది. అటువంటిది, తన తండ్రి అతణ్ణి ప్రతి ఘటించలేక రాజీపడగానే, వివాహానికి సమ్మతించింది. ఇందుకు కారణం, ఆమెకు కష్టాలపాలవుతామన్న భయం తప్ప మరొకటి కాదుగదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కనకసుందరి ప్రవర్తనలో అనుచితమంటూ ఏమీ లేదు. మణిదీపుడు తన తండ్రి ఆదేశానుసారం, మంత్రి సుకీర్తి సలహా లేనిదే, ఏ పనీ చేయడని ఆమెకు తెలుసు. ఎల్లవేళలా మంత్రుల సలహాను తూ.చా తప్పకుండా పాటించే రాజు—కారణం ఏదైనా, ఒక రకంగా అస్వతంత్రుడు. అలాంటివాడు క్రమంగా స్వయంగా ఆలోచించే శక్తిని కోల్పోయి, ఎవరో ఒకరి చేతిలో కీలుబొమ్మ అవుతాడు. మణిదీపుడిలో స్వయంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోగల శక్తిని పరీక్షించేందుకే కనకసుందరి మంత్రికి దేశబహిష్కారం అన్న షరతు పెట్టింది. అయితే, ఈ విషయంలో మణిదీపుడు తన మంత్రి సలహాను పాటించకుండా, జయపాలుడి మీదికి దాడి వెళ్ళాడు. ఇందువల్ల, అతడిలో తనకు నచ్చని సలహాలను కాదనగల శక్తీ, స్వతంత్రంగా ఆలోచించగల నేర్పూ వున్నవని తేలింది. దీనికంతకూ కారణం కనకసుందరి నిర్భయత్వం, పట్టుదలా. అందులో నెగ్గడంవల్లనే ఆమె, మణిదీపుణ్ణి వివాహం ఆడడం జరిగింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






వీరభద్రం పనిమీద పొరుగూరు బయలు దేరుతూ, వంటగదిలో వున్న భార్యను పిలిచి, "అక్కడ పని పూర్తికాగానే, ఎంత రాత్రయినా బయలుదేరి, తెల్లవారే సరికి మన ఇంట్లో వుంటాను," అన్నాడు.

ఆమె, భర్తకు ఎక్కడలేని చీకటి భయం అన్న సంగతి ఎరిగినది కావడంతో, "మీకు భయం చాలా ఎక్కువ. అందు వల్ల రాత్రి వేళ బయల్దేరి రాలేరు," అన్నది.

ఆ జవాబుకు వీరభద్రం విసుక్కుని, "నే నెప్పుడేం చెప్పినా, కాదనడం నీకు బాగా అలవాటైపోయింది. తెల్లవారేసరికి మనింట్లో వుండకపోతే, చూడు!" అన్నాడు పట్టుదలగా.

"వచ్చినప్పుడు మాటగదా—అప్పుడు చూస్తాన్లెండి, మీ పట్టుదలా, పంతం ఏపాటిదో!" అన్నది భార్య నవ్వుతూ.

భార్యాభర్త లిద్దరూ, ఈ విధంగా వాదులాడుకోవడం చాలాసార్లు జరిగింది. అయితే, ఎప్పుడూ భార్యమాటే నిజమవుతూండడం వీరభద్రానికి ఉక్రోషంగా వుంటున్నది. ఏమైనా సరే, యీసారి అనుకున్న ప్రకారం తిరిగిరావాలని, బయల్దేరేటప్పుడే అనుకున్నాడు, వీరభద్రం.

అయితే, అతను ఊరి పొలిమేర దాటకుండానే, పొరుగూరినుంచి ఒక మనిషి వస్తూ ఎదురయ్యాడు. వీరభద్రం అతణ్ణి గుర్తుపట్టి, "అరే, జగన్నాథమా! నా కోసమేనా వస్తున్నావు?" అని అడిగాడు.

"అవును, బాబూ! చిట్టిపంతులుగారు అవసరం అయిన పనిబడి రాజధానికి వెళ్ళారు. తమర్ని ఒక పక్షం రోజులు ఆగి రమ్మని చెప్పమన్నారు," అన్నాడు జగన్నాథం.

"వసుంధర"

వీరభద్రం సరేనని, వెనుదిరిగి గ్రామం చేరి, సరాసరి తన మిత్రుడైన గోవిందయ్య ఇంటికి వెళ్ళి, దారిలో ఏం జరిగిందో చెప్పాడు.

"అయితే, యిక చేసేదేముంది, ఇంటి దారి పట్టు," అన్నాడు గోవిందయ్య.

"అలా కాదు, గోవిందయ్యా! ఈ రోజుకు రహస్యంగా, నీ ఇంట్లో వుండి, రేపు ఉదయమే బయల్దేరి మా ఇంటికి వెళతాను. ఈ ఒక్కసారికైనా, నా భార్యతో పట్టిన పంతం నెగ్గించుకుతీరాలి!" అన్నాడు వీరభద్రం.

అందుకు గోవిందయ్య ఒప్పుకున్నాడు. ఆ రోజంతా వీరభద్రం, ఆ ఇంట్లోనే గడిపాడు. గోవిందయ్య భార్య పుట్టింటికి వెళ్ళింది. ఆ కారణంవల్ల, రాత్రికి రమ్మని గోవిందయ్య యిద్దరు మిత్రులకు కబురు పెట్టాడు. నలుగురూ కలిసి రాత్రి తెల్లవార్లూ జూదం ఆడారు. తెల్లవారుతూండగా అందరికీ ఒళ్ళు తెలియని నిద్ర పట్టేసింది. వాళ్ళకు తిరిగి మెలుకువ వచ్చేసరికి, మిట్టమధ్యాహ్నమై ఫెళఫెళ ఎండ కాస్తున్నది.

గోవిందయ్య, వీరభద్రం వంక జాలిగా చూసి, "మొత్తం మీద నీ భార్య అన్నట్టే జరుగుతున్నది. నువ్వు మధ్యాహ్నానికే ఇల్లు చేరుతున్నావు," అన్నాడు.

వీరభద్రానికి ఎక్కడలేని ఉక్రోషం వచ్చింది. అతడు, గోవిందయ్యతో, "ఇంటికి చీకటి పడ్డాకే వెళతాను," అన్నాడు.

రాత్రివేళ ఇంటికి వచ్చిన వీరభద్రాన్ని చూసి భార్య, "చివరికి నేను చెప్పినట్టే జరిగింది!" అన్నది.

"నువ్వు చెప్పినట్టేం జరగలేదు! నువ్వు మధ్యాహ్నమన్నావు; నేను రాత్రికి వచ్చాను. నేను అన్న ప్రకారం తిరిగిరాలేనప్పుడు, నువ్వు అన్న ప్రకారం ఎందుకు రావాలి? అందుకే, కావాలని మరీ రాత్రికి వచ్చాను," అన్నాడు వీరభద్రం.

భర్త పంతానికి నవ్వాలో, కోపం తెచ్చుకోవాలో, వీరభద్రం భార్యకు తెలియలేదు.





# తెలివి అంటే?

చిత్రపుర గ్రామాధికారికి, చిన్న చిన్న పరీక్షలు పెట్టి, అందులో నెగ్గినవారికి బహుమతులిచ్చి ఆనందించడం సరదా. ఒకసారి ఆయన గ్రామంలో అందరికన్నా తెలివైనవాడెవడో తెలుసుకోవాలనుకున్నాడు.

అయితే, ఆయన గ్రామంలో ఎవరినడిగినా "ఈ చిన్న సంగతే మీకు తెలియదన్న మాట! ఆ రాముడు, భీముడు, సోముడులను మించి, మన గ్రామంలో ఇంక తెలివైనవాళ్ళెవరుంటారు ?" అనసాగారు.

ఇందువల్ల గ్రామాధికారి పని సులభమైపోయింది.

ఆయన ఒకనాడు ఆ ముగ్గురికీ కబురు పెట్టి రప్పించి, "మీ ముగ్గురూ చాలా తెలివైన వాళ్ళని చాలామంది చెప్పగా విన్నాను. అయితే, నాకు మీ ముగ్గురిలోకీ తెలివైనవాడెవడో తెలుసుకోవాలని వుంది. అందుకోసం మీకు ఒక చిన్న పరీక్ష పెడతాను. ఇష్టమేనా ?" అని అడిగాడు.

గ్రామాధికారి యిలా అనగానే ముగ్గురూ చాలా ఆశ్చర్యపోయారు. ఆయనకు తమ తెలివి తేటలు పరీక్షించాలన్న ఆలోచన ఎందుక్కలిగిందో వాళ్ళకు అర్థంకాలేదు. అయినా, ఆయన పెట్టబోయే పరీక్ష ఏమిటో ముందు తెలుసుకోకుండా సరే అనడం మంచిది కాదనుకొని, "ముందు పరీక్ష ఏమిటో చెప్పండి!" అన్నారు ముగ్గురూ.

"మిమ్మల్ని ఎడారి మధ్యలో, మూడు వేరువేరు ప్రాంతాల, ఆహారం యివ్వకుండా వదిలి పెడతాను. ఎవరు ముందు తిరిగి వస్తారో, వారికి పది వరహాల బహుమతి!" అన్నాడు గ్రామాధికారి.

జొన్నలగడ్డ రామలక్ష్మి

"తెలివైనవాడు ఎలాంటి కష్టాన్నయినా తట్టుకుని బయట పడగలడు. ఇసుక కాలకుండా, వేళ్ళు సందుకు పోయి నడక కుంటుపడకుండా, నాకు ప్రత్యేకమైన పాదరక్షలు యిప్పించండి. మీ పరీక్షకు నేను సిద్ధపడతాను," అన్నాడు రాముడు.

"నేనెలా యీ కష్టం నుంచి బయట పడతానో, ఎవరికీ చెప్పను. ఎటొచ్చీ మీరు నాతో పాటు నమ్మకస్థుడైన మరొక మనిషిని కూడా వుంచడం మంచిది," అన్నాడు భీముడు.

ఆ జవాబుకు గ్రామాధికారి ఆశ్చర్య పోయి, "ఇందులో ఏదో తిరకాసున్నది. అదేమిటో దాయకుండా చెప్పు," అన్నాడు.

"తెలివైనవాడు ఎటువంటి కష్టాల్లోనైనా, తోడు వుంచుకునేందుకు చూస్తాడు. కష్టసమయంలో యిద్దరుంటే, పరిష్కార మార్గం మరింత సులభమవుతుంది. అదీ కాక, మీకు నమ్మకస్థుడైన మనిషిని చూస్తూ చూస్తూ ప్రాణాలు పోగొట్టుకో నివ్వరు కదా! ఎడారి మధ్య నుంచి బయట పడడానికి, అతడికేదో సులువైన మార్గం చూపకమానరు. అది నాకూ ఉపయోగపడుతుంది. ఇలాంటి పరీక్షల్లో, అలాంటి షరతులు ముఖ్యం!" అన్నాడు భీముడు.

"మరి నీ మాటేమిటి?" అన్నాడు గ్రామాధికారి, సోముడి వంక తిరిగి.

"తెలివైనవాడు కష్టాలను ధైర్యంగా, తెలివిగా, నేర్పుతో ఎదుర్కొనే మాట నిజమే; కాని కష్టాలను మాత్రం కొని తెచ్చుకోడు. మీరు, నన్ను తెలివైనవాడు కాదనుకున్నా బాధలేదు. కానీ, ముష్టి పదివరహాల కోసం యిలాంటి ప్రమాదకరమైన పరీక్షకు నేనొప్పుకోను," అన్నాడు సోముడు.

ఈ జవాబుతో తెలివి అంటే ఏమిటో గ్రామాధికారికి అర్థమైపోయింది. ఆయన పరీక్ష సంగతి వదిలి పెట్టి, పదివరహాలూ మిగుల్చుకుని, తానూ తెలివైనవాడని పించుకున్నాడు.



# ఒకే ఒక దురలవాటు

ఒక అగ్రహారంలో అనంతు డనే గొప్ప పండితుడుండేవాడు. ఆయనకు సుధాము డనేవాడు ఒక్కడే కొడుకు. వాడికి పెళ్ళీడు వచ్చింది. కాని, ఎరిగినవాళ్ళెవరూ పిల్లనిచ్చేందుకు ముందుకు రాలేదు.

ఇలా వుండగా, అనంతుడికి చిన్నతనంలో గురుకుల సహాధ్యాయి అయిన కామేశం తన కుమార్తెకు పెళ్ళి సంబంధాలు చూస్తూ, అనంతుడున్న అగ్రహారానికి వచ్చాడు. మిత్రులిద్దరూ చిన్ననాటి సంగతులు అవీ యివీ మాట్లాడుకున్న తరవాత, కామేశం తన కుమార్తె సంగతి చెప్పి, "మీ సుధాముడికి, మా అమ్మాయిని ఎందుకు చేసుకోకూడదు? అయినా, సుధాముడికి పెళ్ళి సంబంధాలు రావడం లేదని విన్నాను, కారణం ఏమిటి? దురలవాటుల్లాంటివి ఏమీ లేవుగదా!" అని అడిగాడు.

"ఆ సంగతేదో, వాడితో మాట్లాడి నువ్వే తెలుసుకో," అన్నాడు అనంతుడు చిన్నగా నవ్వి.

ఆ సాయంత్రం కామేశం, సుధాముణ్ణి ఒంటరిగా చూసి, "ఒక చిన్న సంగతి, మరేం అనుకోకు! నీకు జూదం, తాగుడూ—యింకా అలాంటి చిన్నా, పెద్ద దురలవాట్లేం లేవుగదా?" అని అడిగాడు.

"నాకేం దురలవాట్లు లేవు," అన్నాడు సుధాముడు.

కామేశం, యీ సంగతి అనంతుడికి చెప్పాడు. అనంతుడు ఒక క్షణం వూరుకుని, "మా వాడికి వున్నది ఒకే ఒక దురలవాటు, నిజం చెప్పక పోవడం!" అన్నాడు.

—సుంకర భాస్కరరావు





# సూర్యునితో పందెం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు, చిత్రకూట పర్వత ప్రాంతాన తొంభైవేల హంసలు నివసిస్తూ ఉండేవి. ఆ కాలమందే బోధిసత్త్వుడు ఒక హంసగా జన్మించాడు. ఈ హంస అనేకమైన సుగుణాలతోపాటు అపరిమితమైన వేగం కలిగివుండటంచేత, తొంభైవేల హంసలకూ అది పెద్ద అయింది.

ఇన్ని ఉత్తమ గుణాలూ, శక్తులూ వుండడం వల్ల ఈ హంసల పెద్దకు 'రాజహంస' అని పేరు.

ఒకనాడు రాజహంస, తన గుంపుతో సహా, సరోవరంలో విహరించి నివాసానికి మరలుతూ, కాశీరాజ్యం గుండా రావడం తటస్థించింది. బ్రహ్మాండమైన ఆ పక్షుల గుంపును చూస్తే, కాశీరాజ్యమంతటా బంగారు చాందినీ పరిచినట్టుగా వుంది. కాశీరాజు ఆశ్చర్యంతో అటు పరికించాడు.

ఆ పక్షులన్నిటిలోనూ, చుక్కలలో చంద్రుడిలా వెలిగిపోయే రాజహంస కాశీరాజును మరింత ఎక్కువగా ఆకర్షించింది.

ఆ రాజహంసలో మంచి ఠీవీ, తేజస్సూ మొదలైన రాజలక్షణాలు ఉండటం కాశీరాజు గమనించాడు. సేవకుల చేత దివ్యమైన పుష్పమాలికలూ, పూజాద్రవ్యాలూ తెప్పించి, వాటితో రాజహంసకు స్వాగతమిచ్చాడు.

ఘనమైన ఈ స్వాగతం అప్యాయంతో అందుకొన్నది రాజహంస. తన పరివారంతో కూడ కొన్నాళ్ళు అక్కడ వుండి, కాశీరాజు ఆతిథ్యం పొంది, నివాసానికి మరలిపోయింది.

ఆ క్షణం నుంచీ కాశీరాజుకు రాజహంసపైన గల మమత మరింత అతిశయింప సాగింది. ఇప్పు డాయన

మనస్సంతా రాజహంసపైనే ఉంటున్నది. అహర్నిశలు దానిని గురించే తలంపు. ఏ క్షణమందు ఏ దిశనుండి ఆ రాజహంస వస్తుందో అని వెయ్యి కళ్ళతో కనిపెట్టి చూస్తూ వుండేవాడు.

ఒకనాడు చిత్రకూట పర్వత ప్రాంత మండలి హంసలలో రెండు చిన్నారి హంసలు రాజహంస వద్దకు వచ్చి, ''రాజా! మా యిద్దరికీ ఎంతో కాలంగా సూర్యునితో పందెం కడదామని సరదాగా వుంది.'' అంటూ, వాటి మనస్సులోని ఉద్దేశం వెల్లడించినై.

ఈ మాటకు రాజహంస ''ఓసీ, కూనల్లారా! సూర్యుడితో యేమిటి, మీరు పందెం కట్టడ మేమిటి? విడ్డూరం! సూర్యుని వేగం ఎంతటిదో మీకు తెలియదు. కనుకనే అజ్ఞానంలో పడ్డారు. మీరు ఆయనతో పరుగెత్తలేరు సరికదా, పందెంలో మీకు ప్రమాదమూ, ప్రాణాపాయమూ కూడా కలగవచ్చు. అందుచేత ఇంతటితో మీ రిద్దరూ మీ పిచ్చి ఊహలు కట్టిపెట్టండి.'' అని నెమ్మదిగా హితవు చెప్పింది.

హంసపిల్లలకు ఈ హితవు నచ్చలేదు. మళ్ళీ మరొకనాడు పోయి రాజహంసను అనుమతి కోరినై. ఈసారీ అలానే చెప్పింది రాజహంస.



అంతటితోనైనా ఊరుకోకుండా మూడో సారి పోయి మళ్ళీ అడిగినై పిల్లలు. ఈమారూ రాజహంస అంగీకరించలేదు.

ఇది పని కాదని తలచి, తమ సత్తువ తెలియని హంసపిల్లలు రెండూ, యజమానికి తెలియకుండానే యుగంధర పర్వత శిఖరానికి ఎగిరిపోయినై. ఈ శిఖరం సూర్యమండలాన్ని తాకుతున్నదా అనిపించేటంత ఎత్తయింది. కనుక ఆ పెద్ద పర్వత శిఖరం మీద చేరి, సూర్యునితో పందెం వేదామని హంసపిల్లలు అనుకున్నవి.

యథాప్రకారం రాజహంస తన పరివారాన్ని లెక్క చూసుకోగా రెండు హంసలు



తగ్గినై. జరిగిన సంగతి గ్రహించి, అది ఎంతగానో విచారించింది. విచారిస్తే లాభమేముంది! వాటిని ఎలా ఐనా రక్షించాలనుకుంది.

వెంటనే తను కూడా యుగంధర పర్వత శిఖరానికి చేరుకుని, హంసపిల్లలకు తెలియని విధంగా ఒకచోట కూర్చుంది. సూర్యోదయం కాగానే హంసపిల్లలు సూర్యునితోపాటు, ఎగరసాగినై. రాజహంస కూడా వాటిని అనుసరించింది.

'హంసపిల్లలు రెండింటిలో చిన్నది మధ్యాహ్నం వరకూ ఎగిరి, రెక్కలలో మంటపుట్టి, సోలి పడిపోయింది. పడిపోయేటప్పుడు దానికి రాజహంస కనబడగా, "రాజా! నా వల్ల కాలేదు. ఓడిపోయాను...." అన్నది నిస్పృహతో.

అప్పుడు రాజహంస "ఫరవాలేదు, నేనున్నానుగా!" అంటూ, మంచి మాటలతో దానిని రెక్కలపై కెక్కించుకుని పోయి తమ నివాసస్థానంలో తక్కిన గుంపుతో చేర్చింది.

మరి కొంచెంసేపటికి రెండవ హంసపిల్లకు కూడా రెక్కలలో సూదులు పొడిచినట్టు బాధకలిగి, సోలిపోయింది. అదీ రాజహంసను చూసి నిస్పృహతో దీనంగా పలికింది. దానికి కూడా రాజహంస ధైర్యం చెప్పి, రెక్కలపై ఎక్కించుకొని, చిత్రకూటం చేర్చింది.

ఈ విధంగా తన పరివారంలోని రెండు పక్షులు ఓడిపోవటం సహించలేక, రాజహంస తనే పందెం వేయాలని బయల్దేరింది. చెప్పనలవికాని సహజ వేగం గల రాజహంస ఎగరడం ప్రారంభించిన కొద్దిసేపట్లోనే సూర్యబింబాన్ని కలుసుకోవడం, దాటిపోవడమూ కూడా జరిగింది! సూర్యుని సత్తువ ఎంతటిదో చూదామనుకొన్నది కాని, రాజహంసకు పందెం ఎందుకు? దీనివల్ల దానికి కలిసివచ్చేదేమిటి?

కనుక, ఇష్టం వచ్చినట్టు కొంచెంసేపు చుట్టి చుట్టి, చివరకు అలసటచేత భూలో

కానికి దిగివచ్చి, కాశీరాజ్యం చేరుకున్నది. కన్నులు కాయలు కాచేటట్టు కనిపెట్టుకునివున్న కాశీరాజు రాజహంసను చూడగానే తన్మయుడైపోయాడు.

రాజహంసను తన బంగారు సింహాసనం మీద కూర్చోబెట్టి, బంగారు పళ్లెంతో పాయసం, బంగారు కలశంతో చల్లటి పానకం తెచ్చి దానిముందు పెట్టారు. అది కొంచెం స్థిమితపడ్డ తరువాత రాజు కుశలప్రశ్నలు ప్రారంభించాడు.

జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పింది రాజహంస.

అది చెప్పిందంతా విని, రాజు, "పక్షిరాజా! సూర్యునితోనే పందెం కట్టి, అతనిని మించిన నీ ప్రజ్ఞ ఎటువంటిదో చూడవేడుకగా వున్న"దన్నాడు. అప్పుడు రాజహంస రాజుకు తన శక్తిని చూపించదలిచి, "రాజా! నీ రాజ్యంలో, మెరుపు మెరిసేటంతకన్న వేగంగా బాణం వదలగల మేటి విలుకాండ్రు వుంటే, వారిలో నలుగురను ఇక్కడికి రప్పించు," అన్నది. రాజు విలుకాండ్రను పిలిపించాడు.

ఉద్యానవనంలో ఒక నలుచదరపు స్తంభం ఉన్నది. విలుకాండ్రు నలుగురినీ ఆ స్తంభం నాలుగువైపులా నించోబెట్టింది రాజహంస.

తరవాత తన మెడకు ఒక గంట కట్టుకుని, స్తంభం పైన కూర్చున్నది.

"నేను సంజ్ఞ చేయగానే మీరు నలుగురూ బాణాలు వదలండి. నేను ఎగిరి



వెళ్ళి, మీ ఒక్కొక్కరి బాణమే తెచ్చి మీ ముందు పెడతాను. ఐతే, నా మెడలో ఉండే గంట చప్పుడువల్లనే మీరు నా గమనాన్ని తెలుసుకోగలరు గాని, నన్ను కంటితో చూదామంటే ఎంతమాత్రం సాధ్యం కాదు,'' అని చెప్పింది.

ఆ ప్రకారమే, మెరుపు మెరిసేటంతలో విలుకాండ్రు వదిలిన నాలుగు బాణాలూ తెచ్చి రాజహంస, వాళ్ళ ముందు పెట్టింది.

రాజూ, పరివారమూ ఆశ్చర్యభరితులయారు. ''రాజా! చూశావా నా వేగం! ఇది, నేను అతి మెల్లగా ఎగిరినప్పటి కనీసపు వేగం అన్నమాట. దీన్నిబట్టి అసలు, వేగం అనేది ఎటువంటిదో ఊహించగలవేమో చూడు,'' అన్నది.

ఆత్రంతో రాజు ''పక్షిరాజా! నీ వేగం ఎటువంటిదో మచ్చు చూడగలిగాము. మరి, ఇంతకు మించిన వేగం మరెవరికైనా ఉన్నదా?'' అని ప్రశ్నించాడు.

అందుకు రాజహంస ''లేకేమి! నేను నా శక్తి అంతా వినియోగించి అత్యంత వేగంగా ఎగిరినప్పటికీ, నా కంటె వెయ్యి రెట్లు వేగంతో పరుగుతీసే మహాశక్తి ఒకటి ఉన్నది. అదే కాలం అనే సర్పం! ఆ కాలసర్పం అనుక్షణమూ ఈ ప్రపంచ మండలి జీవులను వర్ణింప తరంకాని ప్రచండ వేగంతో నాశనం చేస్తున్నది....'' అని చెప్పేసరికి, రాజు భయంతో కంపించిపోయాడు.

అప్పుడు రాజహంస రూపంలో వున్న బోధిసత్వుడు కాశీరాజుకు ఈ విధంగా తత్వబోధ చేశాడు:

''రాజా! కాలసర్పం ఒకటి ఉన్నదన్న మాట గుర్తుంచుకొన్నవాళ్ళకు భయపడవలసినపనే లేదు. నీతిమంతుడివై, ధర్మాత్ముడివై, పరిపాలన సాగించేటంతవరకూ నీకు ఎవ్వరివల్లనూ ఎట్టి భయమూ లేదు. కనుక నీ విధులు నీవు సక్రమంగా నెరవేర్చుకో.''

బోధిసత్వుడు చెప్పిన హితవు ప్రకారం కాశీరాజు ధర్మపాలన చేసి, గొప్ప కీర్తి గడించాడు.





# బెంటింక్ – డల్హౌసీ

పందొమ్మిదవ శతాబ్దారంభంలో, బ్రిటిష్ వాళ్ళు భారతదేశంలో తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోడానికి పాటుపడ సాగారు. స్వదేశపాలకుల అధిపత్యం సన్నగిల్లసాగింది. మధ్య భారతదేశంలో పిండారీలు అనే దోపిడీదొంగలు ఊళ్లపైబడి, దోచుకుంటూ అల్లకల్లోలం సృష్టించసాగారు.

పిండారీలను అణచడానికి బ్రిటిష్ సైన్యం గట్టిగా పూనుకున్నది. చివరికి పిండారీల నాయకుడైన పఠాను అమీర్ ఖాన్, ఆంగ్లేయుల అధికారాన్ని అంగీకరించాడు. అతడు టోంక్ నవాబు అయ్యాడు. చిట్టూ అనే మరొక నాయకుడు, అడవుల్లోకి పారిపోయి, అక్కడ పులివాత బడ్డాడు.





భర్త చనిపోతే, భార్య అదే చితి మీద సహగమనం చేసే ఆచారం అక్కడక్కడా వుండేది. మొదట భక్తితోనూ, విశ్వాసంతోనూ, ప్రారంభమైన ఈ ఆచారం, క్రమంగా ఒక నిర్బంధంగా, సాంఘిక దురాచారంగా రూపు దాల్చింది. ఈ దురాచారాన్ని నిషేధిస్తూ బెంటింక్ ప్రభువు చట్టం చేశాడు.



దేశంలోని వివిధ ప్రాంతాలలో థగ్గులు అనే బందిపోటు దొంగలు ప్రబలి, బాటసారులపై దాడిజరిపి, దారిదోపిడీలు చేయుసాగారు. బెంటింక్ ప్రభువు థగ్గులను కూడా విజయవంతంగా అణచివేశాడు.

కొన్ని ప్రాంతాలలో, పైర్లు బాగా పండాలని నరబలులిచ్చే దురాచారం వుండేది. ఈ దురాచారాన్ని కూడా రూపుమాపడానికి బెంటింక్ ప్రభువు కఠిన చర్యలు తీసుకుని, గొప్ప సంస్కర్తగా పేరు గడించాడు.





భారతీయ పాలకులందరూ అధికారాన్ని కోల్పోతూన్న సమయంలో, పంజాబులో మహారాజా రంజిత్‌సింగ్ బాగా బలపడసాగాడు. అతని నాయకత్వంలో శిక్కులందరూ ఐకమత్యంతో మెలగసాగారు. దూరదృష్టితో, రంజిత్‌సింగ్ బ్రిటిష్ వారితో స్నేహసంబంధాలు పెంపొందించుకున్నాడు.

1846 వ సంవత్సరంలో డల్హౌసీ ప్రభువు భారతదేశానికి గవర్నర్ జనరల్ అయ్యాడు. రంజిత్‌సింగ్ మరణానంతరం, శిక్కులకూ, బ్రిటిష్‌వారికీ మధ్య యుద్ధాలు ప్రారంభమయ్యాయి. డల్హౌసీ, పంజాబును బ్రిటిష్ ఇండియాలో కలుపుకుని, పెషావర్ నుంచి, బర్మా వరకు బ్రిటిష్ సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడు.





కొడుకులు లేని పాలకుల రాజ్యాలు, ఈస్ట్ ఇండియా కంపెనీకే చెందుతాయని చట్టం చేశాడు డల్హౌసీ. దత్తస్వీకార పద్ధతిని రద్దు చేశాడు. ఈ శాసనం, భారతీయ సంప్రదాయానికి విరుద్ధమైనదనీ, అది పాలకులకు అవమానకరమైనదనీ, అతడు గ్రహించలేకపోయాడు.

ఈ నిరంకుశ శాసనం ద్వారా, నాగపూర్, సంబల్‌పూర్, సతారారాజ్యాలు బ్రిటిష్‌వారి హస్తగతమైనవి. 1853 వ సంవత్సరంలో ఝాన్సీరాజు గంగాధరరావు, రాణీ లక్ష్మీబాయి సమక్షంలో పుత్రుని దత్తతతీసుకున్న తర్వాత, కన్నుమూశాడు. అయినా ఝాన్సీరాజ్యం బ్రిటిష్‌వారికే చెందుతుందని డల్హౌసీ ప్రకటించాడు.





అదే సంవత్సరం, మహారాష్ట్ర పాలకుడు రెండవ పీష్వా బాజీరావు దత్తకుమారుడైన నానాసాహెబును, మహారాష్ట్ర రాజ్య వారసునిగా అంగీకరించడానికి నిరాకరించాడు డల్హౌసీ. ఆ కారణంగా, నానాసాహెబు బ్రిటిష్‌వారికి ప్రబల శత్రువయ్యాడు.

డల్హౌసీ, తీవ్రమైన సామ్రాజ్యవాది అయినప్పటికీ, దేశఅభివృద్ధిపట్ల చాలా ఉత్సాహం కనబరిచాడు. ఆయన కృషి ఫలితంగానే, భారతదేశంలో ప్రప్రథమంగా, 1853వ సంవత్సరంలో బొంబాయి, థానాల మధ్య రైలుమార్గం వేయబడింది.






మన దేశంలో తంతివిధానం ప్రవేశపెట్టడమే కాకుండా, డల్హౌసీ, దేశమంతటికీ వర్తించేట్టు అర్ధణా తపాలా రుసుము అమలుపరిచాడు. కలకత్తా, బొంబాయి, మద్రాసు విశ్వవిద్యాలయాల స్థాపనకు కూడా డల్హౌసీ చాలా కృషి చేశాడు.




# నేను మూర్ఖుణ్ణే!

చిరకాలం క్రిందట ఒక వూరిలో శిలాముఖుడు అనే షావుకారు ఉండేవాడు. అతడికి ధనంతోపాటు, సమస్తమైన ఫల వృక్షాలు కలిగిన పెద్ద తోట వుండేది. ఆ పెద్ద తోటలో ఒక మూల చిన్న పూరిపాక వేసుకుని అందులో అతను కాపురం ఉంటూ వుండేవాడు.

శిలాముఖుడు గడ్డు పిసినారి. తోటలో పండే ఫలాలు తను తినేవాడూ కాదు, ఒక్క ఫలమైనా ఇతరులకు ధర్మమూ చేసేవాడుకాదు.

చెట్ల కాయలు కోయటానికని కూలి వాళ్ళను నియమించాడు శిలాముఖుడు. ఒకసారి ఏమి జరిగిందంటే; విరగకాసి నేలకు వేలాడుతున్న మామిడికాయలను కూలీలు కోసి బుట్టలలో నింపుతున్నారు.

కూలీలు కోసి పడవేస్తున్న ప్రతి కాయనూ శిలాముఖుడు జాగర్తగా లెక్కిస్తూ, "పావలా, అర్ధరూపాయి, ముప్పావలా...." అంటూ వెలలు కట్టి గుణిస్తున్నాడు. అంతలో ఒక కూలివాడు దోరగా వున్న మామిడికాయ తీసి కొరక బోయాడు. వాడిని చూస్తూనే శిలాముఖుడు—

"అబ్బో! ఆ కాయ ఖరీదు రూపాయి. నీ కూలీ అర్ధరూపాయి. రేపు వచ్చి పని చేస్తే బాకీ తీరిపోతుంది!" అన్నాడు.

కూలివాడు నివ్వెరపోయాడు, ఉదయం నుంచి కాయలు కోస్తున్న తను ఏదో నోరూరి ఒక్క కాయ నోట పెట్టేసరికల్లా 'ఖరీదు రూపాయి' అంటున్నాడే అని కోపం వచ్చింది.

శిలాముఖుడూ, కూలీవాడూ మాటా మాటా పెంచుకున్నారు. నానా తిట్లూ తిట్టుకున్నారు. అలా వాదం ముదిరి చేతులు కలిసినై. కూలివాడు రెచ్చిపోయి




శిలాముఖుడికి దేహశుద్ధి చేశాడు. దాంతో శిలాముఖుడు ఉగ్రుడై, అప్పటినించీ తోటలో కాయలు కోయకుండా అలాగే వుంచేశాడు.

ఐతే, అప్పుడప్పుడు ఆ పండ్లను చూస్తే నోరు వూరేది. కాని అంతలోనే—''ఎంత లేదన్నా ఒక్క మామిడిపండు నాలు గణాలు చేస్తుందే! అంత ఖరీదు గల పండు తిని వేస్తే యింత రాబడి నాకు నష్టమేకదా!'' అని అనుకునేవాడు.

కాలం గడుస్తూవుంది. రకరకాల పండ్లు అన్నీ పండి, రాలిపోతూండేవి. శిలాముఖుడు మాత్రం అలా చూస్తూ వూరుకునేవాడు. ఎవరైనా ''ఏమిటయ్యా అలా తోట పాడుపెడుతున్నావే?'' అని అడిగితే—''నేనేం తెలివితక్కువ దద్దమ్మ ననుకున్నావా? ఈ కూలీ వాళ్ళను చచ్చినా నమ్మగూడదు. కాయలు కోయండర్రా అంటే, కోసినన్ని కోసి తిన్నన్ని తినేస్తూంటారు. పోనీ, తిన్నవాటికి డబ్బు కట్టమంటే మీదిమీదికి వస్తారు. ఎందుకొచ్చిన బాధ!'' అనేవాడు.

ఒకనాడు శిలాముఖుడు తోట చుట్టి వద్దామని బయలుదేరాడు. తోటలో మొత్తం ఎన్ని చెట్లు వున్నాయి? ఏ చెట్టుకు ఎన్ని కాయలు కాసినై? రాలిన వెన్ని? కొమ్మల నుంచి వేలాడుతున్న వెన్ని?—ఈ విధంగా అతడు లెక్కలు వేయసాగాడు.

అలా తోటలో నడుస్తూపోతున్న శిలాముఖుడికి ఒక మామిడి కొమ్మమీద కూర్చుని శ్రావ్యంగా పాడుతున్న ఒక చిన్న అందాల పక్షి కనబడింది. అది పిచ్చుక అంతే వుంది. దాని తోకకు ఇంద్ర ధనుస్సులో కనబడే రంగులన్నీ వున్నవి. ఆ చిన్నారి పక్షి మధురంగా గానం చేస్తూ వుంటే, మోళ్ళు సయితం చిగిర్చేటట్టు ఉంది.

ఆ మధుర గానం విని శిలాముఖుడు తన్మయుడైపోయాడు. నెమ్మదిగా వెనకాలే పోయి ఆ చిన్నారిపక్షినిజాగ్రత్తగా గుప్పిట్లో చిక్కించుకొన్నాడు. ఐతే, అది గిలగిలా

కొట్టుకో లేదు; కోపంతో అతనిని పొడవనూ లేదు.

"శిలాముఖా! నన్ను విడిచి పుచ్చావంటే నీకు లాభించే మూడు దివ్య సూక్తులు వినిపిస్తాను," అని అంది పక్షి.

పక్షి నోటినుంచి ఈ విధంగా మానవ భాషలో మాటలు వినబడేసరికి శిలాముఖుడు తత్తరపాటు చెందాడు.

"నిజంగా లాభించే సూక్తులే చెబుతావా?" అని ప్రశ్నించాడు. లాభించటం అంటే ధనరూపంలోనే గదా అనుకున్నాడతను.

"అవును! నిజంగా లాభించే సూక్తులే చెబుతాను," అన్నది పక్షి.

మారుమాటాడకుండా శిలాముఖుడు పక్షిని గుప్పెట నుంచి వదిలాడు. అది ఎగిరిపోయింది. 'లాభం' అన్న మాట ఎప్పుడైతే, చెవినిబడిందో ఆ క్షణమందే అతడికిగల కాస్త యింగితమూ నశించిపోయింది.

ఆ పక్షి రివ్వుమని ఎగిరిపోయి, సమీపాన మామిడికొమ్మ మీద వాలింది. శిలాముఖుడు నోరు తెరచుకుని ఏమి చెబుతుందా అని చెవులు రిక్కించి వున్నాడు.

"ఇదిగో, నేను చెబుతానన్న సూక్తుల్లో మొదటిది—లేనిదాని కోసం విచారించకు!" అని అన్నది, పక్షి.




"ఈ మాత్రం నాకు తెలియద్గా? ఇలాంటి నీతులన్నీ చిన్నతనంలోనే చదువుకున్నా. నీ పిచ్చి కబుర్లు వినేటందుకు నే మూర్ఖుణ్ణి కాను!" అన్నాడు శిలాముఖుడు కోపంగా.

"శిలాముఖా! నిజంగా నువ్వు మూర్ఖుడివే. కాకపోతే, అంతసేపు నన్ను గుప్పెట్లో వుంచుకుని కూడా నా శరీరంలో మణుగు బంగారం వున్న సంగతి గ్రహించనే లేకపోయావే!" అన్నది పక్షి.

"మణుగు బంగారమే! ఒక మణుగు!! అయ్యో, నిన్ను వదిలిపెట్టి ఎంత పొరపాటు చేశాను?" అని విచారించాడు శిలాముఖుడు.

ఇందుకు పక్షి పకపక నవ్వి, రెక్కలు టపటపలాడించింది. "శిలాముఖా! నువ్వు మూర్ఖుడివే. పరమ మూర్ఖుడివి. చిన్న పిచ్చుక అంత వున్న నా లోపల మణుగుబరువుగల బంగారం వున్నదంటే ఎలా నమ్మగలిగావు, పిచ్చివాడా?" అన్నది పక్షి.

శిలాముఖుడు పళ్ళు కొరికి, గుడ్లు ఇంతింత చేశాడు. అప్పుడు పక్షి అతనితో మళ్ళీ ఇలా అన్నది:

"ఇక రెండవ సూక్తి విను! ఇతరులు చెప్పింది అంతా నిజమే అనుకోకు!"

"ఇదీ నేను చిన్నతనంలో చదువుకొన్నదే. ఇందులో మాత్రం కొత్తయేముంది!" అన్నాడు శిలాముఖుడు గుడ్లురుముతూ.

"అన్నీ తెలుసుననుకునే తెలివి తక్కువ దద్దమ్మవు నువ్వు. ఇక మూడో సూక్తి విను: గుప్పెట్లో చిక్కిన లక్ష్మిని వదులుకొని, చెట్టుకొమ్మల మీద వెతకకేం!" అన్నది పక్షి.

ఈ మాటకు శిలాముఖుడు తల నేలకు కొట్టుకొని, "అవును, నిజంగా నేమూర్ఖుణ్ణే!" అని ఈసారి వప్పుకొన్నాడు.

ఆ సమయంలో తోటమధ్యని ఒక పెద్ద గాలి లేచింది. ఆ సుడిగాలి వేళ్ళతో కూడా బ్రహ్మాండమైన వృక్షాలను సైతం నేల కూల్చింది.

భయంతో కళ్ళు మూసుకున్నాడు శిలాముఖుడు. కళ్లు తెరిచిచూస్తే ఏముంది?— తోటలోని చెట్లన్నీ కూకటివేళ్ళతో సహా పెల్లగింపబడి వున్నాయి! చెట్టు కొమ్మ మీద చిన్నారి పక్షి అంతర్థానమైంది. అతను నివసించే పూరిపాక కప్పు కూడా ఎగిరిపోయి మొండిగోడలు మాత్రం ఆనవాలున్నాయి.

"లక్ష్మీదేవి సకలైశ్వర్యాలూ యిచ్చింది. ఐతేనేం? నేను అనుభవించలేదు; ఇతరుల్నీ అనుభవించనీయలేదు. చివరకు అంతా నేలపాలైంది. నిజంగా నేను మూర్ఖుడినే!" అనుకొంటూ పరిపరి విధాల విలపించాడు శిలాముఖుడు.





# యజమానీ-నౌకరూ

పుంగవరం గ్రామంలోని పెద్ద ఆస్తిపరుల్లో, చైతన్య ఒకడు. అతడికి ఈ మధ్యనే వివాహం అయింది. భార్య భానుమతి సంపన్నుల ఇంటిబిడ్డ. ఆమె పుట్టిన రోజు పండగ రేపనగా, ఈనాడు అతను పట్నం వచ్చి, భార్యకు బహుమతిగా యిచ్చేందుకు పదివేల రూపాయిలు పెట్టి, ఒక హారం కొన్నాడు.

అతడు సొంత గుర్రబ్బండిలో తిరుగు ప్రయాణం అయేసరికి సాయంకాలం అయిపోయింది. చీకటి పడకముందే గ్రామం చేరడం క్షేమం అనుకున్న చైతన్య, బండితోలే పోలయ్యతో, "కాస్త వేగంగా బండితోలు!" అని చెప్పాడు.

పోలయ్య తల ఊపి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు. బండి వేగంగా పోతున్నది. చైతన్యకు చిన్న కునుకుపట్టింది. కొంత సేపటికి బండి ఆగడంతో అతడు కళ్ళు తెరిచి, "ఆపావెందుకు? ఏం జరిగింది?" అని పోలయ్యను అడిగాడు.

పోలయ్య దారిపక్కన వున్న ఒక మనిషిని చైతన్యకు చూపుతూ, "ఇతను, నా పెళ్ళాం బాబాయి కొడుకు కాశయ్య, బాబూ! మన గ్రామమే వస్తున్నాడు. తాత చావుబతుకుల మీద వున్నాడట. తొందరగా వెళితే, ఆఖరిచూపులయినా దక్కుతవని ఆశపడుతున్నాడు," అన్నాడు.

"అంటే, బండి ఎక్కుతానంటాడు! సరే, వచ్చి కూర్చోమను," అన్నాడు చైతన్య విసుగ్గా.

అతడికి తన బండిలో యితర్లకు చోటివ్వడం యిష్టముండదు. పోలయ్య బంధువు చైతన్యకు దణ్ణం పెట్టి బండి ఎక్కి కూర్చున్నాడు.

బండి తిరిగి బయలుదేరింది. పోలయ్య గుర్రాన్ని మధ్య మధ్య గట్టిగా అదిలిస్తు

మాచిరాజు కామేశ్వరరావు



న్నాడు. అసలే అది గతుకులదారి. ఒక చోట మలుపుదారి తిరుగుతున్న సమయంలో బండిచక్రం ఒకటి గోతిలో దిగడంతో, బండి చప్పున పక్కకు ఒరిగిపోయింది. పోలయ్య కిందికి దూకేశాడు. చైతన్యా, కాశయ్యా కింద పడ్డారు. వాళ్ళ మీద చైతన్య కొని తెస్తున్న పళ్ళబుట్టలూ, యితర సామానులూ వచ్చిపడినై.

కాశయ్య ముందుగా లేచాడు. పోలయ్యా, అతనూ చైతన్యను లేవదీశారు. చైతన్యకు కుడికాలు కొంచెం బెణికింది. కాశయ్యా, పోలయ్యా బలంగా పట్టి బండి చక్రాన్ని గోతిలోంచి బయిటికి లాగారు. తరవాత కాశయ్య కిందపడిన సామానంతా తిరిగి బండిలో సర్దాడు. బండి బయలుదేరింది. గ్రామం చేరుతూనే కాశయ్య బండి దిగిపోయాడు.

చైతన్య ఇంటిముందు బండి దిగి, బెణికినకాలు పట్టి పట్టివేస్తూ, నడవాలోకి వెళ్ళేసరికి భార్య, "నా పుట్టినరోజు బహుమతి ఎక్కడ?" అని అడిగింది.

ఆ ప్రశ్న వింటూనే చైతన్య మనసు చివుక్కుమన్నది. ఆమె తను కాలు కుంటడం గమనించినట్టేలేదు.

"దారిలో బండి బోల్తాపడ్డంతపని జరిగింది. కాస్తలో పెద్ద ప్రమాదం తప్పింది," అన్నాడు చైతన్య.

"ఆ సంగతి తరవాత వింటా లెండి. ముందు తెచ్చిన బహుమతేదో చూపండి," అంటూ భానుమతి, భర్త చేతిలోని సంచీ తీసుకుని, లోపల వున్న చిన్న పెట్టెను బయిటికి తీసింది.

ఆమె పెట్టెమూత తెరుస్తూ, "నా స్నేహితురాలొకావిడ, ఉదయమే గ్రామం వచ్చింది. మీరేం నాసిరకం బహుమతి తేలేదుకదా!" అని, పెట్టెలోకి చూసి, తరవాత ఆశ్చర్యంగా భర్తకేసి చూసింది.

భార్య ఆశ్చర్యానికి కారణం ఏమిటో తెలియక చైతన్య, తనూ పెట్టెలోకి చూశాడు. అందులో హారం లేదు. అతడు నిర్ఘాంతపోయాడు.

భానుమతి, చైతన్య కేసి రుసరుస లాడుతూ చూసి, ''ఇదా నా పుట్టిన రోజు బహుమానం!'' అంటూ పెట్టెను నేలకు వేసికొట్టి, గదిలోకి వెళ్ళిపోయింది.

భార్య మూర్ఖత్వానికి చైతన్యకు కోపం వచ్చింది. గట్టిగా చీవాట్లు పెట్టబోయిన వాడల్లా తమాయించుకున్నాడు. ముందు హారం సంగతి తేల్చాలి! ఈ దొంగతనం తప్పకుండా కాశయ్యదే అయివుంటుంది.

చైతన్య యిలా ఆలోచిస్తూ, గొడ్లచావడి దగ్గిరకు వచ్చేసరికి, అక్కడ పోలయ్య గుర్రానికి గుగ్గిళ్ళుపెట్టి, ఇంటికి వెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. చైతన్య అతణ్ణి ఆగమని, ''భార్యవైపు బంధువంటూ ఒక దొంగవెధవను బండీ ఎక్కించావు. వాడు బండీలోంచి సామాను కింద పడినప్పుడు, పదివేలు ఖరీదుచేసే హారం కాజేసి, ఖాళీ పెట్టెను నా చేతి సంచీలో పెట్టాడు. వెంటనేపోయి వాణ్ణించి హారం లాక్కురా. హారం లేకుండా పనిలోకి రాకు,'' అన్నాడు కోపంగా.

పదివేల హారం పోయిందనగానే పోలయ్యకు నెత్తినపిడుగుపడినట్టయింది. అతడు యజమానికి ఏం జవాబు చెప్పాలో తోచక తల వంచుకున్నాడు. తరవాత చైతన్య అక్కడి నుంచి కదలగానే, పరుగు, పరుగున గుడిసె చేరాడు.



పోలయ్య భార్య భర్తకోసం ఎదురు చూస్తూ, గుడిసెముందు నిలబడి వున్నది. పోలయ్య ఆమెను సమీపిస్తూ, ''నీ పుట్టింటి బంధువులంతా పేరు మోసిన దొంగపీనుగలు. మీ అన్న కాశయ్య, అయ్యగారి చేతి సంచీలోంచి వేలుచేసే హారం కాజేశాడు. మీ తాత చావుబతుకుల్లో వున్నాడంటే, బండీ ఎక్కనిచ్చాను. పోయి, హారం పట్టుకురా,'' అన్నాడు పళ్ళుకొరుకుతూ.

తన తాత చావుబతుకుల్లో వున్నాడన్న మాట వింటూనే, పోలయ్య భార్య కాశయ్య హారం దొంగిలించాడన్న మాటలు మరిచిపోయి, ''తాతకు అంత జబ్బు



చేసిందా? నాకు మాటమాత్రంగా అయినా, ఎవరూ కబురు చెయ్యలేదే!'' అంటూ తాత ఇంటికేసి పరిగెత్తింది.

చైతన్య గొడ్లచావడి దగ్గిర్నుంచి చిన్నగా కుంటుతూ, వీధివాకిలిని సమీపించేసరికి, తన భార్య ఈడుదే అయిన ఒకామె గడప దిగి వీధిలోకి పోతున్నది. చైతన్య ఆగి ఎవరాయీమె అని చూసేంతలో భానుమతి వచ్చి, అతడి చెయ్యిపట్టుకుని, ''మీ కాలు నొప్పి ఎలా వుంది? మీరేం బహుమతి తెచ్చారో చూద్దాం అని వచ్చిన స్నేహితురాలు, నా కళ్ళు తెరిపించింది. ఇన్నాళ్లూ, నేనెంత మూర్ఖురాలిగా ప్రవర్తించాను,'' అన్నది.

ఆ మాటలు విన్న చైతన్యకు కలిగిన సంతోషం అంతాయింతా కాదు. క్షణంలో అతడి కాలునొప్పి, పదివేల హారం పోయిందన్నబాధ మటుమాయమైంది. అతడు భార్య చేతి ఆసరాతో ఇంట్లోకి వెళ్ళాడు.

ఆ మర్నాటి ఉదయం చైతన్య పోలయ్య కోసం ఎదురు చూస్తూ, వీధి అరుగు మీద కూర్చుని వుండగా, పట్నంలో అతను హారం కొన్న నగలదుకాణం యజమాని వచ్చి, ''క్షమించండి. నిన్న మా దుకాణం పనివాడు హారం వున్న పెట్టె కాక, అలాంటిదే హారం లేని పెట్టెను మీకిచ్చాడు. రాత్రి దుకాణం మూస్తుండగా జరిగిన పొరబాటు బయటపడింది,'' అంటూ హారాన్ని అతడి చేతికిచ్చాడు.

చైతన్య దుకాణం యజమాని నిజాయితీని మెచ్చుకుని, భోజనానికి వుండమన్నాడు. కాని అతను దుకాణంలో తను లేకపోతే పనులు జరగవంటూ వెళ్ళిపోయాడు.

చైతన్య పోలయ్య కోసం మరి కొంచెం సేపు చూసి, హారాన్ని భార్య కిద్దామని బయలుదేరపోతూండగా, పోలయ్య అక్కడికి వచ్చాడు. అతను ఏదో చెప్పబోతూండగా చైతన్య వారించి, హారాన్ని చూపుతూ, ''ఒరే, పోలయ్యా. నిన్న ఈ హారం పోయిందని భ్రమించడం

మంచికే దారితీసింది. మీ అమ్మగారిలో ఎంత మార్పు వచ్చిందనుకున్నావు! హారాన్ని దుకాణంలోనే వదిలి వచ్చాం. దాని యజమాని యింతకుముందే తెచ్చి యిచ్చాడు. నువ్వుపోయి, ఇక పని చూసుకో," అన్నాడు.

పోలయ్యా రెండు చేతులూ ఎత్తి చైతన్యకు నమస్కరించి, "అయ్యా, హారాన్ని కాశయ్యా దొంగిలించాడని పొరబడడం, నాకూ మేలే చేసింది!" అన్నాడు.

"ఏమిటా మేలు?" అన్నాడు చైతన్య ఆశ్చర్యపోతూ.

"గుడిసెకు వెళుతూనే, సంగతి చెప్పి నా పెళ్ళాన్ని వాళ్ళ తాత ఇంటికి పంపాను. చావనున్న తాత, ఏమైనా డబ్బు దాచివుంటే తనకిస్తాడని కాశయ్యా వచ్చాడట. ముసలాడు అలాంటిదేం లేదనే సరికి, నాలుగు తిట్టి వెళ్ళిపోయాడట. నా పెళ్ళాం తెల్లవార్లూ ఒంటరిగా ముసలాడికి సేవ చేసింది. పోయేముందు తను డబ్బు దాచినచోటు, దానికి చెప్పి, దినవారాలు నా చేత చేయించమన్నాడట!" అన్నాడు పోలయ్యా.

"బావుందిరా, పోలయ్యా! ఆ పనులయాకనేరా. ఇంతకూ, ఆ ముసలాడు వదిలిపోయిన డబ్బు ఎంత? కాస్త ఘనంగానే వుందా?" అని అడిగాడు చైతన్య.

"అవునయ్యా! ఆ డబ్బుతో సొంతాన ఏదైనా వ్యాపారం చేసుకోబోతున్నాను," అన్నాడు పోలయ్యా వినయంగా.

ఆ జవాబుతో చైతన్యకు, రాత్రి పోలయ్యాను అనవసరంగా కోప్పడినందుకు చాలా బాధకలిగింది. అతను పోలయ్యా కేసి ఆప్యాయంగా చూస్తూ, "మొత్తం మీద హారం మనిద్దరికీ చాలా మేలు చేసింది. నీ కాళ్ళ మీద నువ్వు నిలబడుతున్నందుకు సంతోషంగా వుంది. నువ్వు చేయబోయే వ్యాపారంలో, నా నుంచి ఏమైనా సాయం కావలసివస్తే, సంకోచించకుండా వచ్చి అడుగు," అన్నాడు.



# ధర్మకార్యాలు

నాగపట్టణంలో చంద్రగుప్త డనే అతడికి, వజ్రాల వ్యాపారంతోపాటు, ఓడవర్తకం కూడా వుండేది. అతడు గొప్ప ధనవంతుడైనప్పటికీ, ఎలాంటి ధర్మకార్యాలకూ తరచుగా విరాళా లంటూ యిచ్చేవాడు కాదు.

"నన్ను పిసినారి అనుకోకండి! ధర్మకార్యాలూ, మంచి పనుల్లాంటివి చేసేందుకు, యింకా బోలెడు కాలం వుంది. ఏదో ఒకనాడు లక్షలు ఖర్చుపెట్టి, పట్టణం మధ్య అద్భుత మైన దేవాలయం కట్టించగలను," అంటూండేవాడు.

ఒకనాడు పూజారి ఒకతను చంద్రగుప్తుడి దగ్గిరకు వచ్చి, శిథిలావస్థలో వున్న దేవాల యాన్ని బాగుచేసేందుకు, ఏమైనా ధనసహాయం చెయ్యమని కోరాడు.

అంతగా యిష్టం లేకపోయినా పూజారిని చూస్తే చంద్రగుప్తుడికి జాలి కలిగింది. అతను నూరు వరహాలు తెచ్చి పూజారికి యిచ్చాడు. ఆ సమయంలో అతడి గుమాస్తా పరిగెత్తుకుంటూ వచ్చి, చంద్రగుప్తుడి ఓడ ఒకటి ఎంతో విలువైన సరుకులతో మునిగిపోయిందని చెప్పాడు.

చంద్రగుప్తుడు, పూజారిని ఏమీ అనుకోవద్దని, తానిచ్చిన నూరు వరహాలూ తిరిగి తీసుకుని గదిలోకి వెళ్ళాడు. పరిస్థితి బాగా లేదని పూజారి వెళ్ళిపోతున్నంతలో చంద్రగుప్తుడు వచ్చి, ఆయనకు వెయ్యి వరహాలు యిస్తూ, "సంపద వుండగానే మంచి పనులు చెయ్యమని భగవం తుడు నాకు పాఠం నేర్పుతున్నాడు," అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

—సి. యస్. ఎ. షరీఫ్






# అతివినయం

శరభయ్య, శివయ్య స్నేహితులు. శరభయ్య లక్షాధికారి. ఆయనకు వ్యవసాయంతో పాటు, గ్రామంలో ధాన్యం కొనడం, అమ్మడంలాంటి వ్యాపారం కూడా వుండేది. ఆయన దగ్గిర రంగప్ప అనేవాడు గుమాస్తాగా వుండేవాడు.

శివయ్య, శరభయ్య యింటికి తరచు వెళుతూండేవాడు. శరభయ్య బాగా స్థితిమంతుడు కావడం వల్ల పని మీద ఆయన ఇంటికి వచ్చిన వాళ్ళెవరైనా, ఆయన పట్ల ఎంతో గౌరవం కనబరుస్తూ, వినయంగా మాట్లాడేవాళ్ళు. కాని, రంగప్ప మాత్రం అలాంటివేం లేకుండా, యజమాని అడిగినదానికి ముక్తసరిగా జవాబులిస్తూ, తన పని చేసుకుపోతూండేవాడు. ఇందుకు శరభయ్య ఏనాడూ, తన గుమాస్తాను మందలించడం శివయ్య కంటబడలేదు.

ఒకసారి శివయ్య తీర్థయాత్రలకు పోయి, రెండు నెలల తరవాత గ్రామం తిరిగి వచ్చాడు. ఆ సాయంత్రం ఆయన శరభయ్యను చూడబోయాడు. ఆ సమయంలో రంగప్ప శరభయ్యతో మాట్లాడుతున్నాడు. ఆ మాట్లాడడంలో శివయ్యకు చాలా మార్పు కనిపించింది. యజమాని చెప్పే ప్రతి దానికీ రంగప్ప ఎక్కడలేని వినయం కనబరుస్తూ, ''చిత్తం, అలాగే, తమ దయ,'' అంటున్నాడు.

శివయ్య, శరభయ్యతో కొంతసేపు తన తీర్థయాత్రా విశేషాల గురించి మాట్లాడి, ''అవును, శరభయ్యా! నీ గుమాస్తా రంగప్ప మాట్లాడే ధోరణిలో అంత మార్పు వచ్చిందేం? ఏనాడూ అతడు నీతో, ప్రతి దానికీ చిత్తం, చిత్తం అంటూ అంత వినయం, అణకువా కనబరుస్తూ మాట్లాడడం వినలేదు,'' అన్నాడు.

పెంటకోట సోమినాయుడు

శరభయ్య ఏదో చెప్పబోయిన వాడల్లా ఆగి, తల ఊపి వూరుకున్నాడు.

ఇది జరిగిన వారం రోజుల తరవాత శివయ్య, శరభయ్య ఇంటికి వెళ్ళాడు. రంగప్ప కూర్చునే స్థానంలో, అతడికి ఎవరో కొత్తవాడు కనిపించాడు.

ఏం జరిగిందో తెలియక శివయ్య, ఆశ్చర్యపోతూ, శరభయ్యతో, "ఆ రంగప్ప కనబడడేం? ఎవడో కొత్తవాణ్ణి గుమాస్తాగా పెట్టుకున్నట్టున్నది," అన్నాడు.

"రంగప్పను పనిలోంచి తీసేశాను. ఆ పని చేస్తున్నతను కొత్త గుమాస్తా," అన్నాడు శరభయ్య తాపీగా.

"అదేమిటి! ఆ మధ్య అతడి ప్రవర్తనలో వచ్చిన మార్పు చూసి, నాకు చాలా తృప్తి కలిగింది," అన్నాడు శివయ్య.

"ఆ మార్పు కారణంగానే, అతణ్ణి పని మాన్పించవలసివచ్చింది," అన్నాడు శరభయ్య.

ఆ జవాబు అర్థంకాక శివయ్య, "లోగడ రంగప్ప ప్రవర్తనలో యజమాని అంటే వుండవలసిన వినయం నాకు కనిపించ లేదు. ఇందుకు నువ్వెలా సహిస్తూ వూరు కుంటున్నావో అనుకున్నాను. ఈ మధ్య చూసినప్పుడు, అతడిలో మంచి మార్పు వచ్చిందని సంతోషించాను," అన్నాడు.

"నువ్వనే ఆ మంచి మార్పే, నేనతణ్ణి అనుమానించడానికి కారణం అయింది. రంగప్ప పనిలో సమర్థుడు. ఇంటిచాకిరీ నౌకరులాగా, నేనుచెప్పే ప్రతిదానికీ చిత్తం అంటూ గొర్రెలా తలాడించనవసరం లేదు. అందువల్ల, అతడి ప్రవర్తన ఏనాడూ నాకు పొగరుబోతుతనంగా కనిపించలేదు. కాని, యీ మధ్య నాతో నంగిలా మాట్లాడడంతో పాటు, అతివినయం ప్రారంభించాడు. దానితో అనుమానం వచ్చి ఆరాతీయగా, నాతో పనుండి వచ్చిన వాళ్ళనుంచి లంచం డబ్బులు గుంజుతున్నట్టు తెలియ వచ్చింది. వెంటనే పనిలోంచి తీసేశాను," అన్నాడు శరభయ్య.

శివయ్య, శరభయ్య వివేకాన్ని మెచ్చుకోకుండా వుండలేకపోయాడు.






శకుని దుర్యోధనుడి తల్లి గాంధారికి తమ్ముడు, గాంధారదేశ రాజైన సుబలుడి కుమారుడు.

వైధవ్యగండం ఉందని సుబలుడు గాంధారికి ముందుగా ఒక పొట్టేలుతో వివాహం జరిపించి, తర్వాత ధృతరాష్ట్రుడితో వివాహం చేశాడు. ఆ పొట్టేలు చచ్చింది.

ఈ సంగతి భీముడు దుర్యోధనుడిని విధవకు పుట్టిన గోళకా! అని సంబోధించి నప్పుడు దుర్యోధనుడికి తెలిసింది.

దుర్యోధనుడు సుబలుడిని, శకునిని పట్టి తెచ్చి అతి దుర్భరమైన కారాగార వాసంలో పెట్టాడు.

సుబలుడు గొప్ప తపోమహిమగలవాడు. చనిపోయేముందు, తన అస్థికలతో పాచికలు తయారుచేసి ప్రతీకారం తీర్చాలని శకునికి చెప్పాడు.

తండ్రి అస్తికలతో తయారు చేసిన పాచికలు శకుని ఏ అంకె కావాలనుకుంటే అలాగ పడతాయి.

శకుని దగ్గరున్న పాచికల సంగతి కారాగార పాలకులవలన విని దుర్యోధనుడు మామను చెరవిడిపించి తన మంత్రిగా చేసుకున్నాడు.

హస్తినాపురంలో శకునికీ, ధర్మరాజుకూ జూదం సాగింది. ధర్మరాజు తనతో తమ్ములనూ, ద్రౌపదినీ ఓడాడు.

అదేసమయంలో ద్వారక అంతఃపుర భవనంలో సత్యభామతో వినోదంగా పాచికలాడుతూ కృష్ణుడు తననూ, రుక్మిణి



మొదలైన ఏడుగురు మహిషులనూ ఓడిపోయాడు.

సత్యభామ, "అక్కా! ఇప్పుడు నువ్వూ, మన నాథుడూ నా సొత్తు! దాన విక్రయ సర్వాధికారాలూ నాకున్నాయి!" అని పరిహాసంగా అంటూ, రుక్మిణి పైట కొంగు తన చేతిలోకి తీసుకుంది.

అప్పుడు కృష్ణుడు ఎటో ఆలకిస్తున్న వాడల్లే, "అక్షయం!" అన్నాడు.

అలా ఎందుకన్నాడో తెలియక అంతా తెల్లమొహాలు వేసి నివ్వెరపోయారు.

అదే సమయంలో హస్తినాపురంలో నిండు సభలో దుశ్శాసనుడు ద్రౌపది కట్టుకున్న చీరపయ్యెద చెరగు లాగుతూంటే, అసహాయురాలైన ద్రౌపది చీర పట్టువదలి చేతులెత్తి, "కృష్ణా!" అని ఎలుగెత్తి మొరపెట్టింది.

దుశ్శాసనుడి రొమ్ము చీల్చి రక్తం త్రాగుతాననీ, దుర్యోధనుడి తొడలు విరగ్గొడతాననీ భీముడు ప్రతిజ్ఞలు చేశాడు.

దుశ్శాసనుడు లాగుతున్నకొద్దీ ద్రౌపది భుజం మీద నుంచి వస్త్రం అక్షయంగా వస్తూ పెద్ద మేటిపడి, దుశ్శాసనుడికి చేతులు పీకి, ముచ్చెమటలు కక్కుతూ పడిపోయాడు.

ద్రౌపది మయసభలో నవ్విందని ప్రతీకారంగా వస్త్రాపహరణం చేయాలనుకున్న దుర్యోధనుడు దించిన తల ఎత్తకుండా కర్ణ, శకుని, దుశ్శాసనులతో సభనుండి నిష్క్రమించాడు.

దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు దుష్టచతుష్టయంగా పేరుపడ్డారు.

క్రోధము, లోభము, మదము, అసూయ మొదలైన గుణాలకూ, అధర్మానికీ మూలమైన కలిపురుషుడు దుర్యోధనుడుగా పుట్టాడు.

నరనారాయణులకు వెన్నిచ్చి, ఒకే ఒక్క కవచంతో పారిపోయి సూర్యుడిలో తలదాచుకొన్న సహస్ర కవచుడు కన్యగా ఉన్న కుంతికి సూర్యుడి వరప్రసాదంగా కర్ణుడుగా పుట్టాడు.

కుంతి పాండురాజు భార్య అయ్యాక, ఆమెకు నరనారాయణులలో నరుడు అర్జునుడుగా పుట్టాడు.

నారాయణుడు కృష్ణుడే. కృష్ణార్జునులు బావమరదులు.

కుంతి కర్ణుడిని నదిలో వదలగా, నదిలో కొట్టుకువస్తూ దొరికిన పిల్లవాణ్ణి సూతుడి భార్య రాధ పెంచుకుంది.

'రాధేయుడు', 'సూతపుత్రుడు'— అనిపించుకున్న కర్ణుడిని అంగదేశానికి రాజును చేసి దుర్యోధనుడు తనకు అండగా చేసుకుని నిబ్బరపడ్డాడు.

కర్ణుడంతటి మహారథుడైన ధనుర్వీరుడు తనకు అండగా ఉండగా అవలీలగా పాండవులను నిర్మూలించడం తథ్యం అని దుర్యోధనుడు నమ్మాడు.

కర్ణుడికి అనేక అనర్థాలు, శాపాలు వున్నాయి. సహజ కవచకుండలాలను ఒలిచి బ్రాహ్మణ భిక్షువుగా వచ్చిన ఇంద్రుడికి దానం యిచ్చేశాడు. అయినా స్వశక్తి మీద అతి విశ్వాసంతో దుర్యోధనుడి నమ్మకాన్ని పెంచుతూ ప్రోత్సహిస్తూనే వచ్చాడు.

'తన ప్రత్యర్థి అయిన అర్జునుడిని యుద్ధంలో చంపాలని కర్ణుడి ఆశయం. అందుకే దుర్యోధనుడితో చేరాడు. పాండవులు అరణ్యవాసం చేరారు.



సత్యభామ నారదుడికి తాను జూదంలో గెల్చుకున్న కృష్ణుడిని దానం చేసి పుణ్యక వ్రతం చేసింది. నారదుడు కృష్ణుడి ఎత్తు బంగారం, రత్నాలు యిస్తేనేగాని కృష్ణుడిని యివ్వనన్నాడు. సత్యభామ కృష్ణ తులాభారం జరిపించి తన వద్ద ఉన్న సువర్ణ, రత్న, ధనరాసులన్నీ వేసినా సరితూగలేదు. రుక్మిణి భక్తితో తులసి దళం వేసి కృష్ణుడిని నారదుడి నుండి విముక్తుణ్ణి చేసింది.

అప్పుడు సత్యభామ రుక్మిణితో, "అక్కా, యిప్పుడు నేను నీకు దాసిని. భక్తికిమాత్రమే కృష్ణుడు అధీనుడు అని నాకు జ్ఞానభిక్ష పెట్టావు!" అన్నది.



సుభద్రార్జునుల కుమారుడైన అభిమన్యుడికీ ఉత్తరకూ వైభవంగా వివాహం జరిగింది.

పాండవులు అరణ్యవాసం చేస్తూన్నప్పుడు సుభద్రాభిమన్యులు ద్వారకలోనే ఉన్నారు. బలరాముడి కుమార్తె శశిరేఖను అభిమన్యుడికి కాకుండా దుర్యోధనుడి కొడుకు లక్ష్మణకుమారుడితో పెళ్ళి నిశ్చయించాడు.

అభిమన్యుడు తల్లితో ద్వారక విడిచి అరణ్యమార్గంలో వెళ్తూండగా, భీముడికీ, హిడింబకూ పుట్టిన ఘటోత్కచుడు తారసపడ్డాడు.

ఘటోత్కచుడు తన రాక్షసమాయలతో మాయాబజారును కల్పించి పెళ్ళికి వచ్చిన మగపెళ్ళివారిని ఆటలాడించాడు. శశిరేఖను ఎత్తుకొని వెళ్ళి అభిమన్యుడికి ఆటవిక వివాహం చేయించి, మాయా శశిరేఖగా ద్వారకలో పెళ్ళిపీటల మీద కూర్చొని మరింత నాటకం ఆడాడు. తర్వాత కృష్ణుడు అన్న బలరాముడిని సమాధానపరిచి శశిరేఖాభిమన్యుల వివాహం వైభవంగా జరిపించాడు.

మేనల్లుడిగా పుట్టిన కృష్ణుడి చేతిలో కంసుడి బొందెను వదలి, కాలనేమి, కృష్ణుడికి మేనల్లుడుగా అభిమన్యుడై పుట్టాడు.

పాండవులు ద్రౌపదితో మత్స్యదేశంలో విరాటరాజు దగ్గిర అజ్ఞాతవాసం చేశారు.

వలలుడు అనే పేరుతో వంటలవాడుగా ఉన్న భీముడు సైరంధ్రిగా ఉన్న ద్రౌపదిని అవమానించిన కీచకుణ్ణి ముద్ద చేసి చంపాడు. సమబలులైన ఐదుగురిలో ముగ్గురు భీముడి చేతిలో హతులయ్యారు. దుర్యోధనుడు మిగిలి ఉన్నాడు.

బృహన్నల పేరున పేడివాడిగా అర్జునుడు రాకుమారి ఉత్తరకు నాట్యం నేర్పాడు. ఉత్తరగోగ్రహణంలో నిజరూపంతో అర్జునుడు యోధానుయోధులతో కూడిన కౌరవసైన్యాన్ని చిత్తుచిత్తుగా తరిమాడు.

కాలనేమి చిరవిరోధి అయినప్పటికీ, తనకు మేనల్లుడై పుట్టినందువల్ల, అభిమన్యుడు యువకవీరులకు ధ్రువతారగా చిరకీర్తిని పొందేలాగ చేయాలని కృష్ణుడి సంకల్పం.

సుభద్ర గర్భవతిగా ఉంటున్నప్పుడు, అర్జునుడు రణరంగంలో పద్మవ్యూహాన్ని ఎలా సాధించాలో ఆ వివరాలు చెప్తూండగా కృష్ణుడు, "అర్జునా, మా చెల్లి సుభద్ర మనస్సు అతి సుకుమారమైనది, ఆమెకు యుద్ధం సంగతులు చెబుతున్నావేమిటి?" అని అంటూ ఏదో పనిమిషతో తీసుకుపోయాడు.



గర్భవాసంలో శిశువుగా ఉన్న అభిమన్యుడు సగమే విన్నాడు; పద్మవ్యూహంలోకి వెళ్ళడమేగాని ఛేదించుకురావడం వినలేదు.

కుర్రతనపు వేడిరక్తపు పొంగుతో అభిమన్యుడు, "మామయ్యా కృష్ణుడు లేకపోయినా రాజ్యం మనదికాక తప్పదు; ఆ కౌరవహతకులను హతమార్చడానికి నేనొక్కడినే చాలు!" అని, సగం పరిజ్ఞానంతో బీరాలు పలుకుతూంటే, కృష్ణుడు మేనల్లుడి భుజం తట్టి, "అభిమన్యు కుమారా! అంతటివాడవేనోయి, అల్లుడా! నీవంటి వీరుడికీర్తి చిరస్థాయిగా నిలుస్తుంది! నిన్ను కన్న వీరమాత సుభద్ర నా చెల్లెలైనందుకు నేనెంతో గర్విస్తున్నాను!" అన్నాడు.

ఉత్తరాభిమన్యులు విరాటనగరంలో ఆనందడోలిక లూగుతున్నారు.

అజ్ఞాతవాసం జయప్రదంగా ముగించాక కౌరవులను అంతమొందించాలని పాండవులూ, పాండవులను నిర్మూలించాలని దుర్యోధనుడూ యుద్ధానికి తహతహలాడుతున్నారు.

అటు నుంచి దుర్యోధనుడు, ఇటు నుంచి అర్జునుడు కృష్ణుడి సహాయం అడగడానికి వచ్చారు.

నిద్రచాలించి లేచిన కృష్ణుడు, ఎదురుగా పాదాల చెంతనున్న అర్జునుణ్ణి



చూసి, తర్వాత తలవైపు ఆసనమలంకరించిన దుర్యోధనుణ్ణి చూశాడు.

ఆయుధాన్ని ధరించననీ, యుద్ధం చేయననీ, తానొక్కడే ఒక వంతు అనీ, యుద్ధవీరులైన యాదవ సేనాబలమంతా ఒకవంతు అనీ చెప్పి, తాను తొలుత చూసిన అర్జునుణ్ణి కోరుకోమన్నాడు కృష్ణుడు.

అర్జునుడు కృష్ణుణ్ణి కోరుకున్నాడు.

యాదవ సైన్యమంతా తనకు దక్కనందుకు దుర్యోధనుడు మహదానందంతో వెళ్ళాడు.

ధృతరాష్ట్రుడు పంపగా సంజయుడు పాండవుల దగ్గిరికి వచ్చి, యుద్ధం మంచిది కాదని శాంతివచనాలు పలికాడు.

పాండవులు కృష్ణుడిని రాయబారానికి పంపారు.

పాండవులకు అర్ధరాజ్యం యివ్వలేకపోతే, ఇంద్రప్రస్థము మొదలైన అయిదు ఊళ్ళు యిచ్చినా చాలునని పాండవుల దూతగా కృష్ణుడు చెప్పాడు. తాను శాంతిని కోరుతూ సంధి చేయవచ్చినవాడిననీ, యుద్ధం తగదనీ నయవాక్యాలతో చెప్పాడు.

సూదిమొన మోపిన పాటినైనా పాండవులకు యిచ్చేది లేదని దుర్యోధనుడు ఖండితంగా చెప్పాడు.

అప్పుడు కృష్ణుడు, "హనుమంతుడితో విజయపతాకం ఎగురుతూండగా నేను సారథ్యం చేస్తున్న రథం మీద అర్జునుడు గాండీవాన్నిపట్టి, నీ సేనల్ని చెండాడుతున్నప్పుడు పదివేలమంది కర్ణులున్నా ఒక్కడూ మిగలడు. నీ మొరాలకించేవాడుండడు. నా మాటలు నమ్ము!" అని కొలువుకూటం మార్మోగేలా చెప్పాడు.

"దూతగా వచ్చి ప్రగల్భాలతో బెదిరిస్తున్నావా? నిన్ను బంధిస్తాం!" అని దుర్యోధనుడు ఉక్కుత్రాటిని దుశ్శాసనుడిచేత తెప్పించాడు. కృష్ణుడి వెంట వచ్చిన సాత్యకి కత్తిదూశాడు.

కష్ణుడు సాత్యకిని వారించుతూ, "ఉట్టి చేతులతో సంధి కుదర్చాలని వచ్చిన

నన్ను బంధించడం న్యాయమేనా? నీ బలగం గొప్పది, ఏం చేస్తాను, నేరక వచ్చాను! బంధించండి!'' అన్నాడు.

దుష్టచతుష్టయం కృష్ణుణ్ణి చుట్టుముట్టి బంధించడానికి చూస్తూంటే, కృష్ణుడు మహోన్నత విశ్వరూపాన్ని ధరించగా, భయావహులై దుర్యోధనాదులు పారిపోయారు.

నయాన, భయాన చెప్పిన కృష్ణుడి రాయబారం విఫలమైంది. యుద్ధం అనివార్యమైంది.

కురుక్షేత్రంలో అనేక అక్షౌహిణుల సేనలతో చేరిన రాజులతో ఉభయపక్షాలు మహాభారత రణరంగానికి సిద్ధమైనాయి. రథాల గంటల హోరుతో, అశ్వఘోషతో దిక్కులు పిక్కటిల్లేలాగ రణదుందుభులు మ్రోగాయి.

ఒకప్పుడు పరశురాముడు క్షత్రియుల రక్తంతో శమంతపంచకమనే అయిదు మడుగులను నింపిన కురుక్షేత్రం మళ్ళీ బలి కోరింది.

సంజయుడికి దివ్యదృష్టి ఉంది. కురుక్షేత్రం ధృతరాష్ట్రుడి మనో నేత్రాలకు కట్టినట్టుగా చెప్పడానికి ఉపక్రమించాడు. పుట్టుగుడ్డివాడై, పుత్రప్రేమతో దుర్యోధనుడిని గట్టిగా మందలించలేని కౌరవచక్రవర్తి ధృతరాష్ట్రుడు వింటున్నాడు. భర్త గ్రుడ్డివాడైనందుకు కళ్ళకు గంతలు కట్టుకొన్న మహా పతివ్రత, గాంధారీదేవి పక్కనే కూర్చున్నది.

సంజయుడు చెప్తున్నాడు, వారు వింటున్నారు.

పాండవ, కౌరవ బలాబలాలు సంజయుడు చెప్పాడు.

ఉభయ బలాల తేడా ఏమిటని ధృతరాష్ట్రుడు అడిగాడు.

పాండవుల బలమూ, కౌరవుల బలమూ సమానంగా ఉన్నప్పటికీ, తమ పక్షాన కృష్ణుడు వుండడం వల్ల, పాండవుల బలమే మిన్నగా ఉన్నదని సంజయుడు, కురుక్షేత్రంలో జరుగుతున్న విశేషాలను సవిస్తరంగా వర్ణించి చెప్పసాగాడు.





# విచిత్ర వివాహం

యరవాన్ నగరాన్ని అబ్దుల్ నయాజ్ అనే నవాబు పాలిస్తూండేవాడు. ఆయనకు ఒక్కగానొక్క కూతురు. ఆ కారణంగా, నవాబు ఆమెకు బాల్యం నుంచీ అన్ని యుద్ధవిద్యలూ నేర్పించాడు.

నవాబు కూతురుకు యుక్తవయసు వచ్చింది. తండ్రి ఆమెకు పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించాడు. ఈ సంగతి తెలిసి ఆమె, "నన్ను, ఏదో రాజ్యపాలకుడి కొడుకు గదా అని, ఏ అర్భకుడికో కట్టబెట్టవద్దు. నే పెళ్ళాడబోయే యువకుడు, నాలాగా యుద్ధవిద్యలలో ఆరితేరినవాడు కావడమే కాదు—అందులో నన్ను మించినవాడై వుండాలి," అన్నది.

"అలాంటివాణ్ణి వెతికి పట్టడం ఎలా!" అంటూ ఆశ్చర్యపోయాడు నవాబు.

"అది చాలా తేలికైన పని. నాతో గుర్రపుస్వారీ, కత్తి యుద్ధం లాంటి వాటిలో పోటీపడి, నన్ను ఓడించిన అతణ్ణి వివాహం ఆడతానని చాటింపు వేయించండి," అన్నది నవాబు కూతురు.

నవాబు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, "అలా అని చాటింపు వేయించడం చాలా సులువు. కాని, తమ అదృష్టం ఏపాటో చూద్దామని అడ్డమైన వాళ్ళూ, నీతో పోటీకి వచ్చే అవకాశం వుంది. దానికి విరుగుడేమిటి?" అన్నాడు.

"అదీ ముందే ఆలోచించాను. నాతో పోటీపడి ఓడిన వాళ్ళ ఆయుధాలూ, గుర్రం నా పరం అవుతుంది. అంతేకాక, వాళ్ళ వీపు మీద నా పేరు వాత వేయించుతాను," అన్నది నవాబు కూతురు.

నవాబు అబ్దుల్ నయాజ్, కుమార్తె చెప్పినట్టే చాటింపు వేయించాడు.

వారం తిరక్కుండానే చుట్టుపక్కల రాజ్యాల్లోని రాజకుమారులు యరవాన్

అరేబియా కథ



నగరం వచ్చి, నవాబు కూతురుతో గుర్రపు స్వారీ, బాణవిద్య, కత్తియుద్ధాల్లో పోటీ పడి చిత్తుగా ఓడిపోయారు. నవాబు కూతురు పెట్టిన షరతుప్రకారం, వాళ్ళ గుర్రాలనూ, ఆయుధాలనూ తీసుకుని, వాళ్ళ వీపుల మీద తన పేరు వాతగా వేయించింది.

ఒక రోజున పర్షియా రాజకుమారుడు యరవాన్‌నగరం వచ్చి, నవాబును కలుసుకున్నాడు. నవాబు అతడికి నిండు మర్యాదలు చేసి, "నువ్వు చాలా పెద్ద రాజ్యానికి, కానున్న రాజువు. నా కుమార్తె షరతులు తెలుసుగదా ? నువ్వు పరాభవం పొందడం నాకిష్టం లేదు. ఈ ప్రయత్నం మానుకుని నాకు అతిథిగా కొన్నాళ్ళుండి వెళ్ళు," అన్నాడు.

"ఇంతదూరం వచ్చి, మీ కుమార్తెతో యుద్ధవిద్యల్లో పోటీ చేయకుండానే తిరిగి వెళ్ళడం మరింత పరాభవ కారణం అవుతుంది," అన్నాడు పర్షియా రాజకుమారుడు.

నవాబు అయిష్టంగానే తన కుమార్తెకూ, పర్షియా రాజకుమారుడికీ పోటీ ఏర్పాటు చేశాడు. ఇద్దరూ గుర్రాలెక్కి కత్తియుద్ధం ప్రారంభించారు. కొద్దిసేపట్లోనే నవాబు కూతురు, యీసారి తనకన్న నిపుణుడైన వాడితో యుద్ధం చేస్తున్నానని గ్రహించింది. పర్షియా రాకుమారుడు తన చేతికత్తిని ఎగరకొట్టి, గుర్రం మీది నుంచి కిందికి తోసే అవకాశాలు వచ్చినా, ఆ పని చేయక పోవడం, తన మీది గౌరవం వల్లనే అని తెలుసుకున్నది.

అయితే, నవాబు కూతురుకు అంతమంది ప్రేక్షకుల ఎదుట ఓటమి ఒప్పుకోవడానికి అభిమానం అడ్డువచ్చింది. ఆమె ఒక పథకం ఆలోచించి, హఠాత్తుగా తన మేలిముసుగును కొంచెం పక్కకు తొలిగించి, పర్షియా రాజకుమారుడి కేసి చూస్తూ చిరునవ్వు నవ్వింది.

ఆమె అద్భుత సౌందర్యం చూసి ఒక్క క్షణం రాజకుమారుడు నివ్వెరపడ్డాడు.

అతడు అజాగ్రత్తగా వున్న ఆ సమయంలో నవాబు కూతురు, అతడి చేతికత్తిని జారి పడేలాకొట్టి, అతణ్ణి గుర్రం మీది నుంచి కిందికి లాగింది.

పర్షియా రాజకుమారుడు అవమానంతో—అంతకుమించి కోపంతో లేచి నిల బడబోతూండగా నలుగురు నీగ్రోబానిసలు అతణ్ణి వడిసిపట్టుకుని, వీపు మీద నవాబు కూతురు పేరును వాతగా కాల్చారు.

పట్టరాని క్రోధంతో కుమిలిపోతూ రాకుమారుడు అక్కడి నుంచి వెళ్ళి పోయాడు. అతడిలో నవాబు కూతురుకు తగిన ప్రతీకారం చెయ్యాలన్న ఆవేశం కలిగింది.



ఒక నెల రోజులు గడిచాక, నవాబు కూతురు ఉద్యానంలో చెలికత్తెలతో తిరుగుతూండగా, ఒకచోట ముసలి వాడొకడు కనిపించాడు. వాడి ముందు చిన్న తివాసీ పరిచి వున్నది. దాని మీద విలువైన రత్నమాణిక్యాలూ, బంగారు నగలూ వున్నవి.

నవాబు కూతురు ఆశ్చర్యపోతూ అతణ్ణి సమీపించి, "ఇవన్నీ అమ్మేందుకు తెచ్చావా?" అని అడిగింది.

"అమ్మడానికాదు. నన్ను పెళ్ళాడిన వాళ్ళకు యివన్నీ బహూకరిస్తాను," అన్నాడు ముసలివాడు.

ఆ జవాబు విని నవాబు కూతురూ, ఆమె చెలికత్తెలూ పెద్దగా నవ్వి, "ఇంత ముసలితనంలో, నీకు పెళ్ళాడ బుద్ధే మిటి?" అని అడిగారు.

"నా చపలబుద్ధి నాది! నన్ను పెళ్ళాడే అమ్మాయి, ఎల్లకాలం నాకు భార్యగా వుండనవసరం లేదు. నాతోపాటు, ఆ చెట్టు కింద వున్న గుర్రం మీద ఒకటి, రెండు క్షణాలు కూర్చుంటేచాలు. ఆ తరవాత నాతో ఆమె పెళ్ళి రద్దయిపోయినట్టే. ఈ విలువైన కానుకలన్నీ యిస్తాను," అన్నాడు ముసలివాడు.

నవాబు కుతురు ఆ జవాబుకు వింత పడి, తన చెలికత్తెలను, "మీలో ఎవరైనా



యీ ఉత్తుత్తి పెళ్ళికి యిష్టపడతారా?'' అని అడిగింది.

చెలికత్తెలందరూ తమకు యిష్టమే నన్నారు. క్షణాల మీద లభించే ధనం చూసి, వాళ్ళకు ఎక్కడలేని ఆశా కలిగింది.

నవాబు కూతురు తన చెలికత్తెల్లో ఒక దాన్ని ఎన్నిక చేసింది. ముసలివాడు చప్పట్లుచరచగానే దూరంగా చెట్టు కింద కూర్చుని వున్న ఒక ముసలిఖాజీ వచ్చి, ముసలివాడికీ, చెలికత్తెకూ పెళ్ళి చేసేశాడు.

ముసలివాడు, ఆమెను తీసుకుపోయి గుర్రం మీద కూర్చోబెట్టుకుని, చెట్టు చుట్టూ రెండుసార్లు తిరిగి కిందికి దిగాడు. ఖాజీ వాళ్ళ పెళ్ళి రద్దయిపోయినట్టు చెప్పాడు. చెలికత్తె, ముసలివాడిచ్చిన రత్నమాణిక్యాలూ, నగలూ తీసుకున్నది.

ఈ విధంగా నాలుగు రోజులపాటు ముసలివాడు నవాబు చెలికత్తెల్లో ఎవరో ఒకరిని పెళ్ళాడి, ఆ మరో క్షణం ఖాజీ చేత రద్దు చేయించి ధనం యిచ్చాడు.

ఐదవనాడు నవాబు కుమార్తె కావాలనే ఒంటరిగా ఉద్యానానికి వచ్చింది. ఆ సమయంలో ముసలివాడు, తన ముందు తివాసీ మీద వున్న వస్తువుల కేసి కన్నార్పకుండా చూస్తూ, ''ఇవ్వాళ ఏ అదృష్టవంతురాలు, నాకు భార్య అవుతుందో తెలియదు. రోజూలా కాక, లక్షలదీనారాలు విలువ చేసే, యీ రత్నాన్ని ఆమెకు యివ్వబోతున్నాను!'' అంటూ తనలో తాను గొణుక్కుంటున్నాడు.

నిజంగానే ముసలివాడి తివాసీ మీద యీ రోజు ధగధగా మెరిసిపోతూ ఒక పెద్ద మణి వున్నది. నవాబు కూతురుకు దాన్ని చూసి చాలా ముచ్చటకలిగింది. ఆమె, ముసలివాడితో, ''నీతో, యీ క్షణకాల వివాహానికి నేను సిద్ధం,'' అన్నది.

ఖాజీ వాళ్ళిద్దరికీ పెళ్ళి చేశాడు. ముసలివాడు నవాబు కూతురుతో గుర్రం ఎక్కి, చెట్టుచుట్టూ ఒకే ఒకమారు తిరిగి,

దాన్ని గట్టిగా అదిలించాడు. గుర్రం వేగంగా పరిగెత్తసాగింది. నవాబు కూతురు ఏదో ఆపదను శంకించి అరవబోయేసరికి, ఆమె నోటి మీద బలంగా చేయివేసి నొక్కాడు ముసలివాడు. నవాబు కూతురు భయం కొద్దీ సొమ్మసిల్లి పోయింది.

కొంతసేపటికి ఆమెకు స్పృహ వచ్చింది. ముసలివాడు ఆమెకేసి కన్నార్పకుండా చూస్తూ, "నేను, నిన్ను శాస్త్రోక్తంగా పెళ్ళాడిన భర్తను!'' అన్నాడు.

"ఆ మాట నిజమే! కాని, దాన్ని రద్దు చేసేందుకు ఖాజీ ఎక్కడ?'' అన్నది నవాబు కూతురు భయంతో దిక్కులు చూస్తూ.

ముసలివాడు పెద్దగా నవ్వి, తెల్లని తన పెట్టుడు గడ్డాన్నీ, తలకట్టునూ లాగి దూరంగా పారవేశాడు. వెంటనే నవాబు కూతురు, అతడు కొన్నాళ్ళక్రితం తన చేత అవమానించబడిన పర్షియా రాకుమారుడని గుర్తించింది.

"నువ్వు, నన్ను మోసంతో ఓడించావు. అటువంటి నిన్ను, మోసంద్వారా పెళ్లాడితే తప్పేమిటి?'' అని అడిగాడు పర్షియా రాకుమారుడు.

నవాబు కూతురు సిగ్గుతో తల పక్కకు తిప్పుకున్నది.

ఆమె తన భార్య అయేందుకు యిష్టపడుతున్నదని గ్రహించిన పర్షియా రాకుమారుడు సంతోషంగా, "నీ పేరు, నా వీపున చెరిగిపోని పద్ధతిలో వేయించావు. అది అనవసరం. నీ పేరూ, రూపం కూడా నా మనసులో చెరగనిస్థితిలో వున్నది,'' అన్నాడు.

ఈసారి నవాబు కూతురు మరింతగా సిగ్గుపడిపోతూ గుర్రం మీది నుంచి కిందికి దిగింది.

తరవాత వాళ్ళిద్దరూ కలిసి రాసిన ఉత్తరం నవాబుకు, ఒక దూత ద్వారా అందింది. ఆయన తన కుమార్తెకు జరిగిన విచిత్రవివాహానికి పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకుని, తనే స్వయంగా వాళ్ళకు రాజప్రాసాదంలో వైభవంగా వివాహం జరిపించాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 అగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Suraj N. Sharma

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి : — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : స్వేచ్ఛకు బంధం

రెండవ ఫోటో : స్వేచ్ఛానందం

పంపినవారు : పి. వి. రాఘవేంద్రరావు, పాణ్యం, కర్నూలు జిల్లా-518112

బహుమతి మొత్తం రు. 50/—నెలాఖరులోగా పంపబడుతుంది.

## మీకు తెలుసా ? సమాధానాలు

1. సర్ అలెగ్జాండర్ గ్రాహం బెల్ 2. గలీలియో 3. థామస్ ఆల్వా ఎడిసన్ 4. రైస్ కెల్లాగ్ 5. డాక్టర్ విలియం స్టోక్స్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# ఉచితం!
## వన్య జీవన స్టికర్లు
## ఫోర్‌హేన్స్
## ఫ్లోరైడ్ టూత్ పేస్టుతో

4 స్టిక్కర్లు 200 గ్రా. ప్యాక్‌తో
3 స్టిక్కర్లు 150 గ్రా. ప్యాక్‌తో
2 స్టిక్కర్లు 100 గ్రా. ప్యాక్‌తో
1 స్టిక్కర్ 50 గ్రా. ప్యాక్‌తో

వన్య జీవన వైభవం.... 15 వివిధ స్టికర్లలో.
వర్ణమయం. ఆకర్షణీయం. ఉత్తేజకరం.
నేడే జమ చేయడం ప్రారంభించండి!

*త్వరపడండి! సరుకు వున్నంత వరకే ఈ అవకాశం*




Pic. E. Hanumantha Rao.
Courtesy: World Wildlife Fund-India Photo Library.

351 F-183 TEL

**Results of Chandamama Camlin Colouring Contest No. 35 (Telugu)**

*1st Prize:* S. Sreeramuilu, Hyderabad-500 020. *2nd Prize:* R.V. Kumar Reddy, Visakhapatnam. T. Vijayadaniel Titokla, Vijayawada-9. P.N.G. Sureshkumar, Rayagada. *3rd Prize:* M. Ananda Rao, Nandyal. L. Gourisankar, Rayagada. P. Sudhakar, Visakhaparman-20. Vaddadi Satyanarayana, Visakhapatnam-1. J. Sarita, Visakhapatnam. M.D. Sirajuddin, Rajahmundry. K. Raghu Babu, Madras-17. P. Rajeswari, Bangalore-580 038. K. Jaya Raju, Vinukonda. P.V. Madhavi, Visakhapatnam-16.



రామ్ శ్యామ్
పార్లే
పంచభుజి
పాఠంలో
రా, శ్యామ్, మన బుజ్జి టీనా ఇవాళ స్కూలుకెందుకు రాలేదో కనుక్కుందాం.
పిన్నీ! టీనా కులాసాయే కదా?
టీనాకు జబ్బుగా ఉంది బాబూ! వచ్చి కులాసా కబుర్లు చెప్పండూ.
హాయ్ టీనా! ఏం జరిగింది?
ఆ పాడు స్వీట్లు తినడం తప్పయింది.
ఏంటిలా చేశావు టీనా! ఇవి అసలైన పాపిన్సే కాదు!
మరి పాపిన్స్ లాగానే వెండి బారలున్నాయి చూడు రామ్!
అయ్యయ్యో! ఈ వెండి బారల్ని కూడా కాపీ కొట్టడం మొదలెట్టారే నకిలీగాళ్లు!
అదిసరే, టీనా! నీలి పంచభుజిలో P-A-R-L-E పేరు చూడకపోయావా! ఇంకా P-O-P-P-I-N-S అన్న అక్షరాల వరస కూడా ఉంటుందే!
రామ్, శ్యామ్ అసలైన పాపిన్స్ రోల్ మీద పేరు టీనాకు చూపుతారు.
ఈసారి మటుకు బాగా గుర్తుంచుకో. మొదట చూసుకో వెండి బారలు....
ఆ తర్వాత పంచభుజిలో పార్లే పేరు. ఇవున్నవే అసలైనవి!
POPPINS
త్వరగా కోలుకుని రా! నీకిష్టమైన మిక్కీమౌస్ కామిక్స్ ఇంకా ఇంకా ఇస్తాం...
ఇంకా నీకిష్టమైన స్వీట్లుకూడా— అసలైన పాపిన్స్!
పార్లే
పాపిన్స్
PARLE
POPPINS
నోరూరించే • మనసు దోచే • మైమరపించే
everest/84/PP/26-tl